# ఆంధ్ర వాఙ్మయ పరిచయము

కోరాడ మహాదేవ శాస్త్రి

సరస్వతీ ప్రచురణము
60 సింగరాచారి వీథి, మద్రాసు-5
1965

ANDHRA VANGMAYA PARICHAYAMU
(An Introduction to Telugu Literature
With best samples of Telugu Poetry)
By KORADA MAHADEVA SASTRI



Cover design:
Sri BAPU

Price: Rs. 12

Published by
Saraswati Pracharanamu,
60, Singarachari Street,
Triplicane,
Madras - 600 005.

*Printed by:*
VEDAM VENKATARAYA SASTRY & BROS.
3 Mallikeswarar Koil South Lane,
Lingi Chetty Street,
MADRAS - 600 001

# ఆశంస

ఆంధ్రవాఙ్మయ చరిత్రలు ఆంధ్రాంగ్లాలలో ఇప్పటికి చాల వెలసినవి. పది పండ్రెండు సంపుటాల నుండి చిన్న పుస్తకాలవరకు ఎందరో వ్రాసినారు. విశ్వవిద్యాలయాల పరీక్షల కుద్దేశించి కొన్ని, నోట్సువంటివి కొన్ని, లైబ్రరీలనిమిత్తము కొన్ని. ఇవి విద్యార్థులకు గాని సామాన్య జిజ్ఞాసువులకు గాని తటాలున బోధపడునవి కావు. వాఙ్మయచరిత్ర, దేశచరిత్రలను సమన్వయించి, సూత్రప్రాయముగా క్రొత్తవారికి ప్రధానాంశాలను బోధించుచు, ఎరిగినవారికి పునఃపరిశీలన ప్రాయముగా మనోవికాసము కలిగించుచు, పరీక్షలవారికి చివరి నిమిషములో ఒకమాటు జ్ఞాపికగా చూచుకొనుట కుపకరించుచు — సూక్ష్మములో మోక్ష — మన్నట్టి సులభరచన ఇంతవరకు లేదు. ప్రియ మిత్రులు డా॥ కోరాడ మహాదేవశాస్త్రిగారు అందరి అక్కరలను అనుభవపూర్వకముగా ఎఱిగినవారు కాబట్టి, క్రొత్తవారికి పరిచయప్రాయంగా, లోతుపాతు లెరిగినవారికి హృదయరంజక పునశ్చరణగా, సామాన్యులకు నవలవలె ఆహ్లాదకరముగా, ఆలవోకగా దీనిని వ్రాసినారు. దీనివలన పరిణత పాండిత్య పరమోచ్ఛ్రితికి లక్షణము సౌలభ్యమే యని నిరూపితమగుచున్నది. విషయాలను సులువుపరచు నేర్పు అనుభవప్రాప్తము. ఈ సమగ్ర, సంగ్రహ సమర్థ రచన వారుద్దేశించినట్లు, బహుళార్థ సాధక మగుగాక యని నా ఆశంస.

ఇది మూడు భాగములుగా విభక్తము. మొదటి భాగము నందు యుగలక్షణ నిరూపణము, ఆ యా కవుల రచనలు, సంప్రదాయాలు చెప్పబడినవి. రెండవదానిలో ప్రసిద్ధ పద్యాలు కూర్పబడినవి. మూడవదానిలో ఆ యా కాలపు రాజులు, వాఙ్మయ పోషకులు, రాజకీయ వాతావరణము మున్నగు చారిత్రక సమన్వయము చేయబడినది.

శాస్త్రి మనుమడు
వేదము వేంకటరాయశాస్త్రి

# మనవి

ఈ ప్రసిద్ధ పద్య సంకలనం తెలుగు భాషా వాఙ్మయాల సంగ్రహ పరిచయం, ఇది చిన్న తరగతుల బాలబాలికలకోసం ఉద్దేశించింది.

పిల్లలకు పద్యం భావయుక్తంగానూ, శ్రావ్యంగానూ చదవడం చిన్నతనంలోనే అలవాటు చేయాలి మంచి పద్యాలు కంఠస్థమై మననమైతే భాషమీద అధికారం, సాహిత్యంలో అభిరుచీ ఏర్పడతాయి. బాల్యంలోనే మంచి అభిరుచులు ఏర్పడినవారు పెద్దవాళ్ళయిన తరవాత గంగవెర్రులెత్తించే వ్యామోహాలకు లోనుకాకుండా ఉంటారు. రసానందం వారి కొరక ఉదాత్తమైన జీవన వైఖరినీ, అపూర్వమైన మానసిక సంస్కారాన్నీ కలుగజేస్తుంది. ఇట్టి ప్రయోజనాన్ని సాధించే దృష్టితోచేసిన ఒక ప్రయత్నం ఇది.

దీనిని ప్రోత్సహించిన మాన్యమిత్రులు సుప్రసిద్ధ చారిత్రక వాఙ్మయ విమర్శకులు శ్రీ వేదం వేంకటరాయశాస్త్రిగారికీ, ముఖచిత్రానికి రూపకల్పన చేసిన కళాతపస్వి శ్రీ బాపు గారికీ కృతజ్ఞతలు. ముద్రణలో సహకరించినవా రందరికీ నా ధన్యవాదాలు.

ఈ పుస్తకం ఉద్దేశాన్ని సఫలం చేయవలసిందిగా ఉపాధ్యాయులకూ, విద్యార్థులకూ నా మనవి!

మద్రాసు
10-7-1985.

కోదాడ మహాదేవశాస్త్రి

తల్లీ! నిన్నుఁ దలంచి పుస్తకము చేతం బూనితిన్, నీవు నా
యుల్లంబందున నిల్చి జృంభణముగా నుక్తుల్ సుశబ్దంబు శో
భిల్లం బల్కుము నాదు వాక్కునను సంప్రీతిన్ జగన్మోహినీ!
ఫుల్లాబ్జాక్షి! సరస్వతీ! భగవతీ! పూర్ణేందు బింబాననా!

*

యా కుందేందు తుషారహార ధవళా, యా శుభ్రవస్త్రావృతా
యా వీణా వర దండ మండిత కరా, యా శ్వేత పద్మాసనా
యా బ్రహ్మాచ్యుత శంకర ప్రభృతిభి ర్దేవై స్సదా పూజితా
సా మాం పాతు సరస్వతీ భగవతీ నిశ్శేషజాడ్యాపహా.

(మల్లెపువ్వులాగ, చంద్రుడులాగ, మంచులాగ తెల్లనిదీ, తెల్లని వస్త్రాలు ధరించి ఉండేదీ, చేతిలో ఎప్పుడూ వీణతో కనిపించేదీ, తెల్లని పద్మంమీద ఆసీనురాలై ఉండేదీ, బ్రహ్మ, విష్ణువు, శివుడు మొదలైన దేవతల మ్రొక్కులు నిత్యం అందుకుంటూ ఉండేదీ, సర్వకలుషాలనూ హరించేదీ అయిన భగవతి సరస్వతి నన్ను సదా కాపాడుగాక!).

# ఆంధ్రవాఙ్మయపరిచయము

## 1. ఆంధ్రభాషావాఙ్మయములు - ప్రారంభదశ

ఇప్పటికి సుమారు మూడువేల సంవత్సరములకు పూర్వం ఉత్తర హిందూదేశంనుండి ఆర్యసంతతివారైన ఆంధ్రులు దక్షిణాపథానికి వలసవచ్చి దేశీయులైన తెలుగువారితో కలిసిపోగా, ఆంధ్ర - తెలుగుజాతి ఏర్పడింది. జాతినామములనుబట్టి దేశభాషలకును ఆంధ్రము, తెలుగు అనే పేర్లు కలిగాయి

మౌర్యసామ్రాజ్య పతనానంతరం ఆంధ్రశాతవాహనులు నాలుగున్నర శతాబ్దాలు (క్రీ పూ 225 - క్రీ శ. 225) దక్షిణాపథాన్ని పాలించారు

పైనుంచివచ్చిన ఆంధ్రుల మాతృభాష ప్రాకృతం. దేశీయులభాష తెలుగు. ఆంధ్రులు తెలుగుదేశం వచ్చినతర్వాత కొంతకాలానికి ప్రాకృతం తెలుగుభాషలో లీనమయిపోయింది

క్రీ పూ 3 శతాబ్దంనుంచి క్రీ శ 3 శతాబ్దంవరకు మనకు లభించిన శాసనాలు ప్రాకృతంలోను, 4 వ శతాబ్దిలో ప్రాకృత సంస్కృతంలోను, 5 - 6 శతాబ్దులలో సంస్కృతంలోను వున్నాయి 7 వ శతాబ్దినుంచి తెలుగు శాసనాలు కనబడుతున్నాయి. 7 - 10 శతాబ్దాలలో మనకు లభించిన తెలుగుభాష అంతా శాసనస్థము. అప్పటి గ్రంథాలేవీ దొరకలేదు

లభించిన మొదటికావ్యం నన్నయ ఆంధ్రమహాభారతం (11 శతా) కనుక నన్నయను ఆదికవి అనీ, ఆంధ్రమహాభారతాన్ని ఆదికావ్యమనీ వ్యవహరిస్తారు.

తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం, ఇంకా మరికొన్ని భాషలు ద్రావిడ భాషాకుటుంబానికి చెందినవి. అంటే ఈ భాషలన్నీ ఒక మూలభాషనుండి ఏర్పడినవని అర్థం. క్రీస్తుపూర్వం 3000 సంవత్సరాల ప్రాంతంలో ఈ ప్రాచీన ద్రావిడభాష ద్రావిడభాషా జనులచేత వ్యవహరింపబడి ఉంటుందనీ, వీరి ఆదిమనివాసం మధ్యధరా

సముద్ర ప్రాంతమనీ, అక్కడినుండి వీరు ఇరాక్, ఇరాన్, అఫ్ఘనిస్థాన్ దేశముల మీదుగా హిందూదేశానికి వలసవచ్చారని, తెలుగుభాష క్రీస్తుపూర్వం 6 వ శతాబ్దానికి తమిళ కన్నడములతో విడిపోయి స్వతంత్రభాషగా రూపొందినదని భాషావేత్తల అభిప్రాయం. మన ప్రాచీనులు తలచినట్లు తెలుగు సంస్కృతజన్యం కాదు.

క్రీస్తుశకారంభ కాలంనుండి ప్రాకృత సంస్కృత శాసనాల్లో లభించిన తెలుగు పదాలనుబట్టి అప్పటి తెలుగుభాషా స్వరూపాన్ని భాషాశాస్త్రజ్ఞులు ఊహించ గలుగుతున్నారు.

ఇట్లు తెలుగుభాషకు సుమారు రెండువేల సంవత్సరాల చరిత్ర, తెలుగు వాఙ్మయానికి వెయ్యి సంవత్సరాల చరిత్ర ఉన్నట్లు తెలుస్తున్నది.

## 2. ఆంధ్రవాఙ్మయచరిత్ర - యుగలక్షణములు

### ప్రాఙ్నన్నయయుగము
(క్రీస్తుశకారంభ కాలంనుండి 1000 వరకు)

తెలుగుభాష వాక్యరూపంలో 7 వ శతాబ్దంనుంచి కనబడుతున్నది. పద్యశాసనాల్లోను కొన్ని గద్యశాసనాల్లోను ప్రయోగింపబడిన కావ్యశైలి నాటి సాహిత్యరచనా వ్యాసంగానికి నిదర్శనం.

శాసనాల్లో నన్నయ శిష్టకవితాభాషను పోలినభాష కానవచ్చినా అప్పటి పండితకవులద్వారా ఆభాషలో ఉత్తమగ్రంథాలేవీ బయలుదేరినట్లగపడదు. దేశికవులా కాలంలో పాడిన పాటలు జనుల ముఖస్థమై ఉండినవి. ఈ దేశికవితాప్రవాహం అప్పటినుండి మూలమూలలబడి, ఎట్లో ముందుకు నెట్టుకుంటూ, మధ్యకాలంలో అంతరిస్తూ, ఎరల బైటపడుతూ ఆధునిక యుగంవరకు వచ్చింది. దీని స్వరూపచ్ఛాయలు ఇప్పటి తుమ్మెదపదాలు, కుచ్చెలకథ, బొబ్బిలిపాట, స్త్రీలపాటలు మొదలైనవాటిలో చూడవచ్చు.

### కవిత్రయయుగము (1000 - 1350)

నన్నయ ఆంధ్రకావ్యపథమును తీర్చిదిద్దినాడు. ఈ యుగంలో కవులు భారత రామాయణ పురాణానువాదములను అనువదించారు. అనువాదములైనా ఇవి రసవంతములైన

స్వతంత్రకావ్యాలు, మతధార్మికగ్రంథాలు తెనిగించడంలో ధర్మోపదేశం వారి ప్రధానాశయం.

తిక్కనకు ముందూ వెనుకా వున్న శివకవులు - మల్లికార్జునపండిత పాల్కురికి సోమనలు - దేశిమార్గము నాదరించి స్వతంత్రకావ్యాలు రచించారు. శైవమతప్రచారం వారి ప్రధానోద్దేశం. 'సకలావయవంబులం బరిపూర్ణంబైన' ప్రౌఢప్రబంధము - నన్నిచోడుని కుమారసంభవము ఈ యుగం లోనిది.

1200 నాటికి కవులు మహాకావ్యరచన మాని చిన్నచిన్న కావ్యాలు చేపట్టారు. కేతన మంచనల కథాకావ్యము లిట్టివి. మంచన కేయూరబాహు చరిత్ర తెలుగులో వెలసిన మొదటి లౌకిక కావ్యం.

## శ్రీనాథయుగము (1350 - 1500)

కవిత్రయ యుగానంతరం వెలసిన మహాకావ్యం భాగవతం (1450) ఒక్కటే. తక్కినవన్నీ లఘుకావ్యాలు. వాఙ్మయ స్థానాలు పెరిగాయి; కవులు అధికమయినారు.

ఈకాలపు రచనలు వెనుకటియుగంలోవలె అనువాదాలేకాని కవులలో తమ వర్ణనాచాతుర్యమును కవితాశక్తిని ప్రదర్శించాలనే అభిలాష పెరిగింది. అవసరమైన చోట్ల కథాంశములను మార్చి శృంగారరసానికి ప్రాధాన్యం కల్పించారు. శ్రీనాధుడు ఈ యుగానికి ప్రతినిధి. అతని శృంగారనైషధం ఈ యుగలక్షణం ప్రస్ఫుటంగా కనబడే రచన. ఇది శ్రీహర్షుని నైషధానికి స్వతంత్రానువతంత్రానువాదం.

పిల్లలమర్రి పినవీరభద్రుడు శ్రీనాధుణ్ణి ఒకమెట్టు దాటి శృంగారశాకుంతలంలో ప్రబంధ ప్రక్రియకు మార్గం చూపాడు

## కృష్ణదేవరాయలయుగము (1500 - 1600)

వెనుకటియుగంలోని స్వతంత్రానువతంత్ర కావ్యానువాదం స్వతంత్రరచనమైన ప్రబంధానికి దారితీసింది.

కావ్య సామాన్యమైన ప్రబంధము క్రమంగా కొన్ని రచనా సంప్రదాయములతో కూడినదై రాయలయుగంలో ఒక ప్రత్యేక కావ్య ప్రక్రియగా పరిణమించింది. పురాణ కథ లేక కల్పితకథతో కూడిన ఇతివృత్తము, స్వకపోల కల్పనలు, వస్త్వైక్యము, శృంగారరస ప్రాధాన్యము, అష్టాదశ వర్ణనలు, అలంకారిక రచన, ఆంధ్రదేశీయతా

ముద్ర, సమకాలీన జీవిత ప్రతిఫలనము — ఇవి 'ప్రబంధము' యొక్క ప్రధాన లక్షణాలు.

కృష్ణరాయలు ఈ యుగానికి ప్రతినిధి. పెద్దన మనుచరిత్ర సర్వాంగ సుందరమైన ప్రథమ ప్రబంధము. ఈ ప్రక్రియలో పరాకాష్ఠ నందినది రామరాజభూషణుని వసుచరిత్ర.

## నాయకరాజుల యుగము (1600 - 1800)

తమిళదేశంలో తంజావూరు, మధుర, మొదలైన సంస్థానాల్లో నాయకరాజులు విజయనగర సాహిత్య సంప్రదాయాలను కొనసాగించారు. రాజులు స్వయంగా కవులై తమ ఆస్థానాల్లో కవిపండితులను కళలను పోషించారు.

పరభాషాప్రాంతంలో నివసించేజనుల అవసరాలకు, ప్రభువుల చిత్తవృత్తికి అనుగుణంగా దక్షిణాంధ్రవాఙ్మయం కొన్ని విశిష్ట లక్షణాలను సంతరించుకొన్నది: ఉత్తరాంధ్ర ప్రబంధములవలె వర్ణనాప్రధానములుకాక కథాప్రధానములైన కావ్యములు, గేయకవితకు పద్యకవితలో సమానమైన గౌరవము, దేశీయ ప్రదర్శనానుకూలమయిన యక్షగాన రచన, మోహశృంగారకావ్య రచనలు, భారత భాగవత రామాయణాదులకు వచనానువాదములు, కావ్యభాషా సారళ్యము, వ్యావహారికభాషా ప్రయోగము మొదలైనవి ఆ లక్షణాలు.

ఆంధ్రభాష సహజ మాధుర్యమంతా దక్షిణాంధ్రవాఙ్మయంలో నిగ్గుదేరింది.

తంజావూరు కవులు పద్యకావ్యాలూ యక్షగానాలూ రచించారు. మధుర రాజ్యంలో కవులు శృంగార ప్రబంధాలూ వచన రచనలూ చేశారు

ఈ యుగంలో ఉత్తరాంధ్రదేశమున క్షీణయుగ లక్షణములు పొడసూపినవి.

## సంధియుగము (1800 - 1900)

సామ్రాజ్యాలు గతించి చిల్లర ప్రభువులు రాజులయారు. కవులూ నిస్తేజస్కులైనారు. పాండిత్య ప్రకటనమే గుణంగా పరిగణింపబడి, పిల్లవసుచరిత్రలు నిరోష్ఠ్య నిర్వచనాది రచనలు బయలుదేరాయి. వర్ణనలు గతానుగతికాలు. పురవర్ణనలో సౌధాగ్రాలు ఆకాశాన్ని అంటుతున్నాయని ఒక కవి వర్ణిస్తే ఆకాశాన్ని దూసుకొనిపోతున్నాయని మరొక కవి వర్ణిస్తాడు

మరొకవైపు ఈ శతాబ్దంలో పాశ్చాత్య ప్రభావం అధికమవుతూవచ్చి విద్యాధికులలో భావసంఘర్షణం కలిగింది. సంఘమత సంస్కరణోద్యమాలు, ముద్రణా యంత్రము, పత్రికారచనము, విద్యావ్యాప్తి మొదలైన కారణములవలన ప్రజలలో ఒక నూతన చైతన్యం బయలుదేరింది. బ్రౌను, తదితర పాశ్చాత్య పండితులు ఆంధ్రభాషావాఙ్మయాభివృద్ధికి విశేషమైన కృషిచేశారు.

ఇండో యూరోపియన్ భాషాధ్యయనంవలన తెలియవచ్చిన భాషాశాస్త్ర సూత్రములను మన దేశభాషలకు అన్వయింపజేసి కాల్డ్వెల్ మొదలైన పండితులు నూతన భాషాసిద్ధాంతాలను నెలకొల్పారు. తెలుగు సంస్కృత జన్యం కాదని నిరూపింపబడింది

ఈ యుగంలో ముఖ్యంగా గమనింపవలసినది — వచన రచనకు ప్రాధాన్యమూ, శైలిలో సారళ్యమూ ఏర్పడటం.

## ఆధునికయుగము (1900 - )

పాశ్చాత్యుల సంసర్గమువలన, ఆంగ్లవాఙ్మయపరనమువలన బయలుదేరిన నూతన ఆదర్శాలు వాఙ్మయంలో నూతన ఆదర్శాలకు కారణమయాయి. క్రొత్తక్రొత్త వాఙ్మయ ప్రక్రియలు వ్యాప్తిలోనికి వచ్చాయి వ్యావహారికభాష ప్రజాదరం పొందింది

'ప్రాచీన కవిత్వమునకు భరతవాక్యము, ఆధునిక కవిత్వమునకు నాంది' పలికినవారు తిరుపతి వేంకటకవులు.

## 2 శృంగారరసనిర్వహణ

1. కవిత్రయయుగంలో — శృంగారరసం ఉదాత్తంగా పోషింపబడింది.
2. శ్రీనాథయుగంలో — శృంగార రసోదాత్తత తగ్గింది.
3. కృష్ణరాయలయుగంలో — శృంగారం విచ్చలవిడిగా వర్ణింపబడింది. అయినా ఇది వివాహానికి విరుద్ధమయిన శృంగారం కాదు.
4. నాయకరాజులయుగంలో — మోహశృంగారకావ్యాల్లో నీతిబాహ్యమైన పరకీయ శృంగారము, కామలీల విశృంఖలంగా వర్ణింపబడింది.
5. సంధియుగంలో — శృంగార వర్ణనలో వెనుకటి ధోరణి మారింది.

6. ఆధునికయుగంలో— ప్రజల అభిరుచులు మారడంలో దాని కనుగుణంగా కవులు 'అమలిన శృంగారము'ను చిత్రించడం మొదలుపెట్టారు.

## 3. కవిత్రయయుగము

### ఆంధ్రమహాభారతము

నన్నయ (1050) రాజరాజనరేంద్రుని ప్రోత్సాహంతో ఆదిసభాపర్వాలు, అరణ్యపర్వంలో కొంతభాగము రచించినతర్వాత ఏ కారణంచేతనో ఆ రచన మధ్యలో ఆగిపోయింది.

తిక్కన (1250) విరాటపర్వం మొదలుకొని స్వర్గారోహణపర్వం వరకు - 15 పర్వాలు తుదిముట్ట రచించాడు తాను హరిహరనాథునికి అంకితంగా చెప్పడంచేత కాబోలు నరాంకితమైన అరణ్యపర్వ భాగాన్ని తెనిగించలేదు.

ఎఱ్ఱన (1350) అరణ్యపర్వశేషాన్ని నన్నయపేర పూరించి భారతానికి అనుబంధ గ్రంథమైన హరివంశమును కూడా తెనిగించాడు.

ఇట్లు భారతరచన పూర్తికావడానికి రెండున్నర శతాబ్దాలు పట్టింది. లక్ష శ్లోకములకు పైబడిఉన్న సంస్కృత భారతం తెలుగులో సగానికి సంగ్రహింపబడింది. నన్నయ భారతభాగం - గద్య పద్య సంఖ్య 10,080, ఎఱ్ఱన భారత భాగం 3,842 తిక్కన భారత భాగం 33,000. మొత్తం 47,502.

కవిత్రయ భారతం సర్వజనులకు స్తుతిపాత్ర మయింది. భారతమును లక్ష్యంగా చేసుకొని లాక్షణికులు కావ్యభాషకు లక్షణం చెప్పారు.

### ఆంధ్ర రామాయణాలు

13 వ శతాబ్దంలో రెండు విపుల రామాయణాలు వచ్చాయి. 1. రంగనాథ రామాయణం - ద్విపద. గోన బుద్ధారెడ్డి కర్త అతని కొడుకులు ఉత్తర రామాయణం రచించారు. ప్రజాసామాన్యానికి అందుబాటులో ఉండాలని ద్విపద ఛందస్సులో సులభమైన శైలిలో రచింపబడింది. 2. భాస్కర రామాయణం - చంపువు. హుళక్కి భాస్కరుడు, అతని శిష్యులు ముగ్గురు కలిసి చేసిన సమిష్టి రచన ఇది. శీఘ్రకాలంలో ముగించాలనే ఉద్దేశంతో ఇట్లు పలువురు పూనుకున్నట్లు తోస్తుంది. తిక్కన వి

సంగ్రహ రామాయణాలు. వీటిలో మొదటిది తిక్కన నిర్వచనోత్తర రామాయణం. మధ్యయుగంలోని రామాయణాలు · అన్నమయ్య (15 శతా), అయ్యలరాజు రామభద్రుడు (16 శతా), మొల్ల (16 శతా), శాకల్య మల్లికార్జునభట్టు (17 శతా), కంకంటి పాపరాజు (17 శతా. ఉత్తరరామాయణం) మొదలగువారి కృతులు. మొల్ల రామాయణం దేశంలో బహుళ ప్రచారం గాంచింది. 18 వ శతాబ్దంనుంచి రామాయణాలు తామరతంపరగా వచ్చాయి 'రాఘవేశ్వరు చారిత్ర మెంద రెన్నివిధముల్ కీర్తించినన్ గ్రాలవే!' ఆధునికయుగంలో రామాయణాలు: గోపీనాథకవి, వావిలికొలను సుబ్బారావు, జనమంచి శేషాద్రిశర్మ, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి, విశ్వనాథ సత్యనారాయణ (రామాయణ కల్పవృక్షం) మొదలైనవారివి.

## ఆంధ్రమహాభాగవతము

చాళుక్యయుగంలో భారతము, కాకతీయయుగంలో రామాయణము, వెలమల పోషణలో భాగవతము తెలుగులోనికి వచ్చాయి

భాగవతం పోతనచేతిలో పడటం అతని పూర్వజన్మ సుకృతమేకాదు, ఆంధ్రుల భాగ్యవిశేషం కూడాను. ఏమంటే భాగవత రచనకు భక్తపోతనకు గల అధికారము మరొకరికి లేదు.

భాగవతంవలె సర్వజనానురంజకమైన కావ్యం తెలుగువాఙ్మయంలో మరొకటి లేదు.

దేశకాల వైపరీత్యంవలన భాగవతంలో కొంతభాగం ఉత్పన్నముకాగా దానిని తరువాతి కవులు కొందరు పూరించారు. షష్ఠ ఏకాదశ ద్వాదశ స్కంధాలు అన్యకవికృతములు.

కారణం ఏమైనా భారత రామాయణ భాగవత మహాకావ్యాలు తెలుగులో బహుకర్తృకతకు పాల్పడడం విచిత్రమైన సన్నివేశం. ఈ మూడూ తెలుగువారికి పవిత్రమైన పారాయణ గ్రంథాలు.

శుకమహాముని శాపగ్రస్తుడైన పరీక్షిన్మహారాజుకు ఏడుదినములలో భాగవతం వినిపించి ముక్తికలుగజేశాడు. దీనినిబట్టి భాగవత సప్తాహం జరపడం మనవారిలో ఒక సంప్రదాయంగా ఏర్పడింది. సంస్కృత భాగవతాన్ని సప్తాహములలో సంపూర్ణంగా పారాయణ చేయడం పుణ్యకార్యంగా మనవారు భావిస్తారు. ఇట్లే

భారతంలో విరాటపర్వము రామాయణంలో సుందరకాండ పారాయణ చేయడం శుభప్రదమని హిందువుల విశ్వాసం

భారతంలో 18 పర్వాలు, రామాయణ 6 + 1 కాండలు, భాగవతం 12 స్కంధాలు వున్నాయి

## కథాకావ్యం

ఇది మతపౌరాణిక సంబంధంలేనిది, నీతిబోధకము. దీనిలో సాధారణంగా అద్భుత కల్పనలు అలౌకిక సన్నివేశాలు వుంటాయి కొన్ని కథాకావ్యాలు :

దశకుమారచరిత్ర - 13 శతా కేతన, పదిమంది రాజకుమారుల సాహస చర్యలు, ప్రేమవృత్తాంతములు ఇందు వర్ణితములు. దండి గద్య రచన కిది కావ్యానువాదము.

కేయూరబాహుచరిత్ర - 13 శతా. మంచన. నీతిబోధకములైన కథ లిందు గలవు. రాజశేఖర కవియొక్క విద్ధసాలభంజిక నాటిక కిది కావ్యానువాదము.

విక్రమార్కచరిత్ర - 15 శతా. జక్కన. విక్రమార్కుని సాహస కార్యాలు వర్ణింపబడ్డాయి

సింహాసనద్వాత్రింశిక - 15 శతా. కొరవి గోపరాజు. భోజునికి విక్రమార్కుని సింహాసనంమీది సాలభంజికలు చెప్పిన 32 కథల సంపుటి.

పంచతంత్రము - 15 శతా. దూబగుంట నారాయణకవి, తరువాత బైచరాజు వెంకటనాధుడు దీనిని అనువదించారు. ఇందులో పశుపక్ష్యాదులు పాత్రలు. ఈ కథలు జగత్ ప్రసిద్ధమైనవి.

శుకసప్తతి - 18 శతా. పాలవేకరి కదిరీపతి, స్త్రీ పురుషుల చిత్తవృత్తులను తెలిపే కథ లివి

హంసవింశతి - 18 శతా అయ్యలరాజు నారాయణకవి. హంసచెప్పిన 20 కథలు, శుకసప్తతి కథలవంటివి.

## పురాణం

కవిత్రయ యుగంలో పురాణానువాదం ప్రారంభమయింది. మారన మార్కండేయ పురాణం ఈ అనువాదశాఖలో మొదటి గ్రంథం.

## కవిత్రయయుగము

పురాణం ఐతిహ్యంద్వారా వేదధర్మాలను బోధిస్తుంది. ఇందులో సృష్టిక్రమము, పూర్వరాజుల వంశచరిత్ర, అవతార కథలు, క్షేత్రమాహాత్మ్య కథలు మొదలైనవి వుంటాయి. తెలుగులో క్షేత్రమాహాత్మ్య గ్రంథాలకు పురాణకథలే ఆధారం.

పురాణాల్లో భాగవతం ప్రధానమైనది ఇది భక్తిరసపు ముద్ద. ఇతర పురాణాల వలె భాగవతం ఛాందసధోరణిలో లేక రసవంతములైన కథలతో ఒప్పి ఉన్నది. హరివంశపురాణం కూడా అవతార కథలనే చెబుతుంది కాని భాగవతంలోని భక్తిభావన ఇందులో లేదు.

ఎర్రన హరివంశ రచనను మించవలెననే ఉద్దేశంతో నాచన సోమన ఉత్తర భాగంలోని రసవంతమైన కథలను గ్రహించి 'నవీనగుణ'ములతో ఉత్తర హరివంశం రచించాడు. పురాణేతివృత్తమును ప్రబంధీకరించేపద్ధతి ఇతనితో ప్రారంభమయింది.

పురాణం ధర్మాన్ని బోధిస్తుంది. పెదపురుగులు పుట్ట పెట్టినట్లుగా మానవుడు మెల్ల మెల్లగా ధర్మాన్ని సంగ్రహించాలి. మనిషి మరణించిన తర్వాత భార్యా పుత్రాదులెవ్వరూ తనవెంటరారు, ధర్మంఒక్కటే తన్ను అనుసరిస్తుంది. కనుక ప్రతిఒక్కరు ధర్మం ఆచరించాలి.

ధర్మమనేది సంస్కార రూపంలో జీవుణ్ణి అంటిపెట్టుకొని వుంటుంది. సంస్కార తారతమ్యములను బట్టి మరుజన్మలో ఉదాత్త మానవజన్మ కాని క్రిమికీటకాది జన్మకాని కలుగుతుంది. పూర్వజన్మ సుకృతంవల్ల ఇప్పటి శరీరం లభించినట్లే ఈ జన్మలో చేసిన కర్మవలన భావిజన్మ లభిస్తుంది. జీవితంలో ఏదీ నిర్హేతుకంగా జరగదు. ఇదే కర్మసిద్ధాంతం.

### పురాణానువాదాలు – కొన్ని :

మార్కండేయపురాణం - 13 శతా. మారన.

పద్మపురాణోత్తరఖండం - 14 శతా. మడికి సింగన.

హరివంశం, నృసింహపురాణం - 14 శతా. ఎర్రన.

ఉత్తరహరివంశం - 14 శతా. నాచన సోమన.

విష్ణుపురాణం - 14 శతా. వెన్నెలకంటి సూరన.

వరాహపురాణం - 15 శతా. నంది మల్లయ, ఘంట సింగయ.

భాగవతం - 15 శతా పోతన.

వరాహపురాణం, ఉత్తర నృసింహపురాణం - 15 శతా. హరిభట్టు.

మారన తిక్కన శిష్యుడు నాచనసోముడు తిక్కన పరోక్ష శిష్యుడు. ఇతడు కొన్నిచోట్ల కవిత్వంలో కవిత్రయమును కూడా మించినాడని 'అలికంబున నక్షివి డాచిన సర్వజ్ఞు' డని స్తుతింపబడ్డాడు. నన్నిచోడ నాచనసోమనలు ప్రబంధ వర్ణనలకు మార్గదర్శకులు.

పద్మపురాణోత్తరఖండంలో మాఘమాహాత్మ్యమును గురించిన కథలు అనేకం వున్నాయి.

వరాహపురాణం తుళువ నరసనాయకునికి అంకితము. ఇతని కుమారుడే కృష్ణదేవరాయలు. జంట కవులలో నొకడైన ఘంట సింగయ మేనల్లుడు నంది తిమ్మన. కనుక అతనికి చిన్నతనంలో చంద్రగిరి నివాసము, కృష్ణరాయలతో సాన్నిహిత్యమును సంభవమే.

ఆముక్తమాల్యదలోని ఖాండిక్య కేశిధ్వజ సంవాదం విష్ణుపురాణంలోనిది.

బసవపురాణం - బసవేశ్వరుని పురాణ పురుషునిగా భావించి పాల్కురికి సోమన బసవపురాణం చెప్పాడు.

## శివకవులు

శంకరుని అద్వైతమతమును ఖండించి రామానుజాచార్యులు (11 శతా.) వైష్ణవమతాన్ని, శివుడే పరదైవమని బసవేశ్వరుడు (12 శతా.) వీరశైవమతాన్ని ప్రవర్తింప జేశారు వీ రిద్దరు వర్ణభేదాలను నిరసించి భక్తి ప్రాధాన్యాన్ని బోధించారు. తెలుగువారికి మొదటినుండీ అద్వైతమే బాగా ఒంటబట్టింది. అయినా మతప్రచారకుల వలన రాజాదరం వలన కొంతవరకు ఈ మతాలు ఆంధ్రదేశంలో వ్యాపించాయి.

వీరశైవ మతవ్యాప్తికి తమ రచనలద్వారా తోడ్పడి గురుపూజనందిన మహనీయులు పండితత్రయ మనబడినవారు. శ్రీపతి పండితుడు, శివలెంక మంచన, మల్లికార్జున పండితారాధ్యుడు పండితారాధ్యుడు శివతత్త్వసారమనే శైవమత ప్రతిపాదక గ్రంథకర్త పాల్కురికి సోమన కాకతీయ ప్రతాపరుద్రుని (1298-1323) సమకాలికుడు.

ఇతడు భక్తుల కథలను, వీరశైవ మతగురువుల చరిత్రలను ఇతివృత్తంగా గ్రహించి నన్నయాదులవలె సంస్కృత భూయిష్ఠమైన భాషలోగాక ప్రజావ్యవహారానికి సన్నిహితమైన జానుతెలుగులో ద్విపద ఛందస్సులో బసవపురాణ పండితారాధ్య చరిత్రలను, ఇంకా అనేకమైన మతగ్రంథాలను, స్తుతికావ్యాలను రచించాడు.

సోమన రచనలలో—అక్షరాంకగద్య, బసవోదాహరణము, వృషాధిపశతకము భగవదారాధనా పరములైన స్తుతికావ్యాలు. పద్యపాదంలో మొదటి అక్షరాలను అకారాదిక్రమమున కూర్చటం అక్షరాంక గద్య. సప్తవిధ విభక్తులు వరసగా వచ్చేటట్లు కూర్చటం ఉదాహరణ. మకుటనియమంతో వంద పద్యములు చెప్పటం శతకం.

## చంపువు - ద్విపద

చంపూ కావ్యంలో భిన్నవృత్తాలు వాడతారు. ద్విపద ఏకవృత్త రచన

పద్యకావ్యంకంటె ద్విపద పాడుకోడానికి అనుకూలంగా వుంటుంది. సోమన శ్రీనాథుల రచనల వలన ద్విపదకు శిష్టవాఙ్మయంలో స్థానం లభించింది. కాని ద్విపద అన్నా పదకవిత అన్నా పండితులకు చిన్నచూపే.

## ఉదాహరణ కావ్యం

ఉదాహరణ: ఇది మన వాఙ్మయానికి ప్రత్యేకమైన రచనా ప్రక్రియ, లఘుకృతి. ప్రాచీనకాలంలో పది పన్నెండుకంటె ఎక్కువ లేవు. వీటిలో ప్రధానమైనవి

బసవోదాహరణం - 13 - 14 శతా. పాల్కురికి సోమన.
త్రిపురాంతకోదాహరణం - 14 శతా రావిపాటి తిప్పన్న.
వేంకటేశోదాహరణం - 15 శతా. తాళ్లపాక పెదతిరుమలాచార్యులు.
కృష్ణోదాహరణం - 17 శతా అప్పకవి.

## శతకం

శతకం దైవస్తుతి పరమైన కావ్యం. శృంగార వేదాంత నీతి హాస్య విషయిక శతకాలూ వున్నాయి. శతకానికి తెలుగులో మకుటం ప్రధానం. శతకంలో 100, 108 లేక 116 పద్యాలు వుంటాయి, కాని సంఖ్యానియమం అంత ప్రధానంకాదు. సంస్కృతంలో శతకం వంద శ్లోకాలకు మించి వుండవు. మకుటంలేదు.

శతక వాఙ్మయం తెలుగులో బాగా అభివృద్ధి చెందింది.

ప్రసిద్ధమైన శతకాలు కొన్ని

సర్వేశ్వరశతకం - 13 శతా. యథావాక్కుల అన్నమయ్య.

వృషాధిపశతకం - 13 - 14 శతా. పాల్కురికి సోమన.

సుమతీశతకం - 13 - 14 శతా. బద్దెన.

(ఒంటిమిట్ట) రఘువీరశతకం - 16 శతా అయ్యలరాజు తిప్పన.

కాళహస్తీశ్వరశతకం - 16 శతా ధూర్జటి

భాస్కరశతకం - 16 శతా మారన వెంకయ్య.

దాశరథీశతకం - 17 శతా. కంచెర్ల గోపన్న.

కవిచౌడప్పశతకం - 17 శతా. కుందవరపు చౌడప్ప.

గువ్వలచెన్నశతకం - 17 శతా. గువ్వల చెన్నడు.

రామలింగేశ్వరశతకం - 18 శతా అడిదం సూరకవి.

సింహాద్రి నారసింహశతకం - 18 శతా గోగులపాటి కూర్మనాథుడు.

ఆంధ్రనాయకశతకం - 18 శతా. కాసుల పురుషోత్తమకవి.

కృష్ణశతకం - 18 శతా. నృసింహకవి.

వేమనపద్యాలు - 17 శతా. ఇవి కొన్ని వేలదాకా వున్నాయి.

## 4. శ్రీనాథయుగము

ఈ యుగంలో వెలువడిన ప్రసిద్ధ కావ్యాలు :

శృంగారనైషధం
హరవిలాసం
భీమఖండం
కాశీఖండం
శివరాత్రిమాహాత్మ్యం
పల్నాటివీరచరిత్ర
క్రీడాభిరామం

} శ్రీనాథుడు

శివలీలావిలాసం - నిశ్శంక కొమ్మన
నాచికేతూపాఖ్యానం - దగ్గుపల్లి దుగ్గన
ప్రబోధచంద్రోదయం - నంది మల్లయ, ఘంట సింగయ
శృంగారశాకుంతలం, జైమినీభారతం - పిల్లలమర్రి పినవీరభద్రుడు
నవనాథచరిత్ర (ద్విపద), హరిశ్చంద్ర (ద్విపద) - గౌరన

శ్రీనాథుని రచనలలో శృంగారనైషధం ప్రసిద్ధమైనది. ఇది నలదమయంతుల ప్రేమ - వివాహకథ. శ్రీహర్షుని నైషధానికి అనువాదం. గ్రంథాంతంలో శ్రీనాథుడు తన ఆంధ్రీకరణ పద్ధతిని ఇట్లు సూచించాడు. "అశేషమసీపి హృదయంగమంబుగా శబ్దంబనుసరించియు, అభిప్రాయంబు గురించియు, భావం బుపలక్షించియు, రసంబు పోషించియు, అలంకారంబు భూషించియు, ఔచిత్యం బాదరించియు, అనౌచిత్యంబు పరిహరించియు, మాతృకానుసారంబున చెప్పబడిన" అవి.

హరవిలాసము - శివసంబంధమైన కథలు ఒక దారముతో ముడివేయబడిన పూలదండవలె కూర్చబడినవి సిరియాలునికథ, గౌరీకల్యాణము, దారుకావనవిహారము, హాలాహలభక్షణము, కిరాతార్జునీయము అను కథ లిందు గలవు

భీమేశ్వరపురాణము - ద్రాక్షారామ భీమేశ్వరుని లీలలు వర్ణితములు. ఇందులో గోదావరీమండలమును కవి తనివితీర వర్ణించాడు కాశీఖండంకూడా క్షేత్రమాహాత్మ్య గ్రంథమే.

క్రీడాభిరామం - ఇది వీధినాటకం. ఇద్దరు యువకులు ఓరుగల్లు పట్టణపు వీధులలో తిరుగుతూ తాము చూసిన శృంగార దృశ్యాలు వర్ణిస్తారు. కాకతీయులనాటి ప్రజాజీవితం ఇందులో స్ఫుటంగా ప్రతిఫలిస్తూంది. ఇది హేళన కావ్యం.

పల్నాటి వీరచరిత్ర - ఇది వీరగాథ. ఇతివృత్తం ప్రజావాఙ్మంలోనిది ఈ గ్రంథం తేట తెనుగులో ద్విపదలో వ్రాయబడింది గానమునకు గల ప్రాధాన్యమును బట్టి ఇది పదకవిత్వ మనిపించుకుంటుంది.

నాచికేతోపాఖ్యానం - నచికేతుని గురించిన ఉపనిషత్ కథ. శాంతరస ప్రధానమైనది. కర్మాచరణము కంటె ఆత్మవిద్య గొప్పదని ఇందులో నిరూపింపబడింది.

ప్రబోధచంద్రోదయం - కృష్ణమిశ్రుని సంస్కృత నాటకానికి కావ్యానువాదం. మానవునిలోని ఉత్తమ ప్రకృతులకు దుష్టప్రకృతులకు కలిగే సంగ్రామము, వష

ప్రకృతులు ఓడిపోతే ప్రబోధచంద్రుడు ఉదయించి జ్ఞానోదయమవడము ఇందు వర్ణింపబడింది.

శృంగారశాకుంతలం - ఇందులో కవి మూలభారతకథను, కాళిదాసనాటక క్రమమును గ్రహించి, తాను కొన్నిమార్పులుచేసి శృంగారరసప్రధానంగా రచించాడు. ఇది అనువాదం కాకపోతే 'ప్రబంధ' మనదగిన రచన. జైమినిభారతం భారతాశ్వమేధపర్వకథ. వ్యాసభారతంలో లేనికథలు - చంద్రహాసునికథ, చండికథ, ప్రమీల కథ మొదలైనవి దీనిలో వున్నాయి. కావ్యం ఆద్యంతము కృష్ణమహిమ వర్ణింపబడింది

అన్నమాచార్యులు సాళువ నరసింగరాయలకు పిల్లలమఱ్ఱి పినవీరభద్రునకు సమకాలికుడు. శఠకోపయతి శిష్యుడు సంకీర్తనాచార్యుడు. శ్రీవేంకటేశ్వరుని పై వేలకొలది సంకీర్తనములను గానంచేసిన పరమభక్తుడు.

నవనాథచరిత్ర - నాథ సంప్రదాయానికి చెందిన తొమ్మండుగురు శివయోగుల చరిత్ర. వీరిలో చౌరంగి ( > సారంగ > సారంగధరుడు ) ఒకడు. సారంగధర కథ అసలు మహారాష్ట్ర దేశానికి సంబంధించినది తెలుగుకవులు దీనిని తెలుగుదేశానికి అవతరింపజేశారు. సారంగధర హరిశ్చంద్రకథలు తెలుగువారికి మిక్కిలి ప్రీతి పాత్రములు.

## వేదాంతగ్రంథాలు

వాసిష్ఠరామాయణము - 14 శతా. మడికి సింగన

పరతత్త్వరసాయనము - 15 శతా. ఈశ్వర ఫణిభట్టు

సీతారామాంజనేయ సంవాదము - 18 శతా. పరశురామపంతుల లింగమూర్తి.

## సంకలనగ్రంథాలు

మడికి సింగన కూర్చిన సకలనీతిసమ్మతమనే గ్రంథము విశిష్టమైన రచన. ప్రాచీన ప్రబంధాలనుండి పద్యరత్నములు ఇందులో సేకరింపబడ్డాయి.

ప్రబంధరత్నావళి, ప్రబంధమణిభూషణము - 18 శతా.

ఆధునికయుగంలో ఇట్టి సంకలన గ్రంథాలు అనేకం వచ్చాయి. వీటిలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారి చాటుపద్య మణిమంజరి ముఖ్యమైనది.

## 5. కృష్ణరాయలయుగము

ఈ యుగంలో రచింపబడిన ప్రసిద్ధ కావ్యాలు :

రాజశేఖరచరిత్ర - మాదయ్యగారి మల్లన
ఆముక్తమాల్యద - కృష్ణదేవరాయలు
మనుచరిత్ర - అల్లసాని పెద్దన
పారిజాతాపహరణం - నంది తిమ్మన
కాళహస్తిమాహాత్మ్యం - ధూర్జటి
రామాభ్యుదయం - అయ్యలరాజు రామభద్రుడు
కళాపూర్ణోదయం, ప్రభావతీప్రద్యుమ్నం - పింగళి సూరన
వసుచరిత్ర - రామరాజభూషణుడు
పాండురంగమాహాత్మ్యం - తెనాలి రామకృష్ణుడు
రాధామాధవం - చింతలపూడి ఎల్లన్న
కవికర్ణరసాయనం - సంకుసాల నృసింహకవి
అష్టమహిషీకల్యాణం - తాళ్లపాక చిన్నన్న (ద్విపద)

తెలంగాణాలో - గోలకొండ ప్రభువుల ఆశ్రయంలో :

నిరంకుశోపాఖ్యానం - కందుకూరి రుద్రకవి
తపతీసంవరణోపాఖ్యానం - అద్దంకి గంగాధరకవి
వైజయంతీవిలాసం - సారంగు తమ్మయ
విప్రనారాయణచరిత్ర - చదలువాడ మల్లన.

### కృష్ణదేవరాయలు

చరిత్రకారుల పరిశోధనవలన తెలియవచ్చిన రాయల జీవిత విశేషాలు : జననం 1465 ప్రాంతం. రాజ్యాభిషేకం 1509 (కృష్ణాష్టమి, ఆగస్టు 7), నిర్యాణం 1529.




కృష్ణరాయల దేవేరులు చిన్నాదేవి (తల్లిదండ్రులెవరో తెలియదు), తిరుమల దేవి (శ్రీరంగపట్నం రాజు కూతురు), తుక్కాదేవి ( < లక్కా < లక్ష్మి, ఉత్కల గజపతి రాజు కూతురు), అన్నపూర్ణాదేవి (వివరాలు తెలియదు). 1515 లో తన కూతురు తిరుమలాంబను ఆర్వీటి రామరాయలకిచ్చి వివాహం చేశారు. 1516 లో రాయలకు తిరుమలాంబవలన కుమారుడు జనించాడు కాని ఆ సంతానం దక్కలేదు.

రాయలకు కళాభిమానము, కవిత్వపోషణము వారసత్వంగా వచ్చిన గుణాలు. తండ్రి నరసనాయకుడు కవిపండిత పోషకుడు. రాయలబాల్యం చంద్రగిరిలో గడిచింది. తాను రాజు అవుతానని అతడు అనుకొని వుండడు. అన్న వీరనరసింహరాయల ఆకస్మిక మరణంవలన తను పరిస్థితుల ప్రభావంవలన రాజు అయాడు. కనుక రాజ్యాధికారం వహించే వరకు నిశ్చింతగా కావ్యశాస్త్ర వ్యాసంగంలోను పెద్దల గోష్ఠిలోను, రాచకార్యాల్లోను పాల్గొంటూ కాలం గడిపాడు. తిమ్మరుసు ఇతని గురువు. పెద్దన తిమ్మనలు చంద్రగిరిలో బాల్యమిత్రులై వుండడానికి అవకాశం వుంది. వీరు ఇంచుమించు సమవయస్కులు. 1509 లో రాజ్యానికి వచ్చేసరికి తాను సకల విషయములలోను పరిపూర్ణ సామర్థ్యం సంపాదించాడు. పదిసంవత్సరాల్లో (1510 - 1520) శత్రురాజులపై విజయములు సాధించి సాహిత్యరంగంలోను తన ఆధిపత్యం నిరూపించి సాహితీ సమరాంగణ సార్వభౌము డయాడు.

రాయల భువనవిజయ సభామంటపంలో సాహిత్య గోష్ఠులు జరిగేవి. ఇతని ఆస్థానంలో అష్టదిగ్గజములనే ఎనమండుగురు కవిశ్రేష్ఠు లుండేవారు: అల్లసాని పెద్దన, నంది తిమ్మన, అయ్యలరాజు రామభద్రుడు, ధూర్జటి, మాదయ్యగారి మల్లన, తెనాలి రామకృష్ణుడు, పింగళి సూరన, రామరాజభూషణుడు. వీరుగాక సంస్కృత తమిళ కన్నడ కవిపండితులుకూడా వుండేవారు. రాయలు జైత్రయాత్రకు వెళ్లేటప్పుడు

పెద్దన, తిమ్మన, మాదయ్యగారి మల్లన మొదలైన కవులను తనతో తీసుకొని వెళ్ళేవాడట. యుద్ధవిరామసమయంలో సాహిత్యగోష్ఠి జరిగేది.

రాయలు 1524 లో కుమారుని రాజుచేసి తాను మంత్రిగా రాజ్యపాలనం ప్రారంభించాడు. కాని రాజ్యాభిషేకోత్సవాలు ఇంకా జరుగుతూవుండగానే దైవవశాన బాలరాజు వ్యాధిగ్రస్తుడై మరణించాడు. తిమ్మరుసు విషప్రయోగంచేసి చంపించాడన్న చెప్పుడుమాటలు విని రాయ లాతనిని చెరబెట్టి కండ్లు పీకించినట్లు కథలు ప్రచారంలో వున్నాయి. దీని నిజానిజము లేమైనా రాయలకు చివరిరోజుల్లో అశాంతి యేర్పడిం దన్నది వాస్తవం. (వేదం వేంకటరాయశాస్త్రి (మనుమడు) ఆముక్తమాల్యద సంజీవిని వ్యాఖ్య - ద్వితీయముద్రణ - ఉపోద్ఘాతం).

## మీఁది గ్రంథాలను గూర్చిన వివరాలు

ఆముక్తమాల్యద = (తాను) కొప్పున ధరించి తీసిన పూదండను దేవునికి సమర్పించిన కన్య - గోదాదేవి ( = ఆండాళ్ ) శ్రీరంగేశుని వివాహమైన కథ.

మనుచరిత్ర - స్వారోచిష మనుసంభవ కథ. ఇందులో మొదటి మూడాశ్వాసా లలో వరూధినీ ప్రవరాఖ్యము అతి రమణీయమైన ఘట్టం.

పారిజాతాపహరణం - శ్రీకృష్ణుడు పారిజాతవృక్షాన్ని స్వర్గలోకంనుండి తెచ్చి సత్యభామయింట నిలుపుట ఇందలి కథావస్తువు.

ఆముక్తమాల్యద - మనుచరిత్ర - పారిజాతాపహరణము. ఇంచుమించు సమ కాలంలో రచింపబడినట్లు తోస్తుంది.

రాజశేఖరచరిత్ర - రాజశేఖర కాంతిమతుల వివాహము ఇతివృత్తం. కథ చిన్నది. ప్రబంధ వర్ణనలతో గ్రంథం పెరిగింది.

కాళహస్తిమాహాత్మ్యము - క్షేత్రమాహాత్మ్య కథలు.

రామాభ్యుదయం - ప్రబంధరూపం దాల్చిన రామాయణ కథ.

కళాపూర్ణోదయం - సి ఆర్. రెడ్డిగారి ప్రశంస లందుకొన్న కావ్యము. విశ్వరూపముదాల్చిన ఆదిదంపతుల శృంగారము ఇందలి ఇతివృత్తము. ఇందులో నాయికమైన కలభాషిణి వేశ్య. కల్పిత కథ. ప్రపంచ వాఙ్మయంలోనే ఉత్తమోత్త మములైన కావ్యములలో ఒకటిగా నెన్నదగినదని ప్రశంసింపబడింది.

ప్రభావతీ ప్రద్యుమ్నం. శ్రీకృష్ణుని కొడుకు ప్రద్యుమ్నుడు రాక్షసరాజు కూతురు ప్రభావతిని వివాహమాడిన కథ. ఈ కావ్యంలో శుచిముఖి (ఆడహంస) వంటి ప్రజ్ఞామూర్తి ఆంధ్రవాఙ్మయంలో మరెక్కడను లేదు. ఇది కథలో నాయికా నాయకుల మధ్య దౌత్యం నడుపుతుంది.

వసుచరిత్ర - శుక్తిమతీ కోలాహలుల తనయుడు వసురాజు గిరికను వివాహ మాడిన కథ భారతంలో ఉపరిచరవసువు కథ దీనికి మూలం. దీని ననుసరించి 'పిల్ల వసుచరిత్రలు' బయలుదేరాయి.

పాండురంగమాహాత్మ్యం - బాలకృష్ణుడు పాండురంగడై వెలసిన పుండరీక క్షేత్రంయొక్క ప్రభావాన్ని చెప్పే కథలతో కూడినది. వీటిలో నిగమశర్మ కథ ప్రసిద్ధమైనది

కవికర్ణరసాయనం - సూర్యవంశజుడైన మాంధాతృచక్రవర్తి వృత్తాంతం.

వైజయంతీవిలాసము } వైష్ణవభక్తుడైన విప్రనారాయణుని దేవదేవి అనే
విప్రనారాయణచరిత్ర } వేశ్య లోబరచుకొన్న కథ. వైజయంతీవిలాసంలో మోహశృంగార వృక్షానికి బీజం నాటబడింది.

తెనాలి రామకృష్ణుడు వికటకవి అని ప్రతీతి. ఇతనిని గూర్చిన కథలు తెలుగు దేశంలోనేకాక దక్షిణదేశం అంతటా ప్రచారంలో వున్నాయి.

## పంచకావ్యాలు

శృంగారనైషధము, మనుచరిత్ర, ఆముక్తమాల్యద, వసుచరిత్ర, పాండురంగ మాహాత్మ్యము - ఇవి తెలుగులో పంచకావ్యాలు. వెనుకటిరోజుల్లో సాహిత్యజ్ఞానం అలవరచుకోడానికి పంచకావ్యాలు చదివేవారు.

## శ్లేషకావ్యం - అచ్చ తెనుగు కావ్యం

పూర్వకవులు తమ రచనలలో అక్కడక్కడ శ్లేషపద్యాలు, అచ్చ తెనుగు పద్యాలు వాడడం చూసి 16 వ శతాబ్దంనుంచి కవులు ప్రత్యేకం శ్లేషకావ్యాలు, అచ్చ తెనుగు కావ్యాలు వ్రాయడం మొదలుపెట్టారు. వీటిలో శిల్ప ప్రౌఢిమే కాని రసపుష్టి లేదు

ద్వ్యర్థి కావ్యాలు :
రాఘవపాండవీయం - పింగళి సూరన
హరిశ్చంద్రనలోపాఖ్యానం - రామరాజభూషణుడు.
నైషధపారిజాతీయం - కృష్ణాధ్వరి.

త్ర్యర్థి కావ్యము :
యాదవ రాఘవ పాండవీయం - నెల్లూరు వీరరాఘవకవి.

అచ్చ తెనుగుకావ్యాలు :
యయాతిచరిత్ర - పొన్నగంటి తెలగన.

అచ్చతెనుగురామాయణం
నీలాసుందరీపరిణయం } కూచిమంచి తిమ్మకవి.

## కావ్యప్రబంధముల తారతమ్య పరిశీలన

1. ఆంధ్రీకరణము . స్వతంత్రరచన.
2. సమగ్రంగా పురాణేతివృత్తం కథావస్తువు .
   పురాణకథ లేక కల్పితకథ కథావస్తువు.
3. ధీరప్రకృతిగలవారు నాయికానాయకులు :
   మధుర ప్రకృతిగలవారు నాయికానాయకులు.
4. శాంతవీరరసములకు ప్రాధాన్యం :
   శృంగారరసమునకు ప్రాధాన్యం.
5. ఉపమ, రూపకము, స్వభావోక్తి అలంకారముల వాడుక అధికము :
   వీటితోపాటు ఉత్ప్రేక్ష, అతిశయోక్తుల వాడుక అధికము.
6. కథాప్రధానములు : వర్ణనా ప్రధానములు.
7. సులభ సామాన్యమైన శైలి : పాండిత్య ప్రకర్షకై ప్రౌఢమైన శైలి.
8. ధర్మప్రతిపాదనము కవుల ఆదర్శం
   ఆనందదాయకత్వము కవుల ఆదర్శం.

[ఇందవిల్లి లక్ష్మీరంజనం. ఆంధ్ర సాహిత్య చరిత్ర సంగ్రహము]

## పూర్వకవుల ప్రబంధధోరణి

ప్రబంధం హఠాత్తుగా రాయలయుగంలో బయలుదేరలేదు. అంతకుపూర్వం నుంచి పరిణామం చెందుతూవచ్చింది.

తిక్కన ప్రబంధమండలి బంధము, నాచనసోముని నవీనగుణ ప్రదర్శనము, ఎఱ్ఱన సూక్తి వైచిత్రి, జక్కన మంచనాదుల అనువాదములలో ఆంధ్రతాముద్ర, శ్రీనాథుడు హరవిలాసములో చూపిన మాలాకారితనము, శ్రీనాథ పినవీరనల రచనలలో శృంగారరస ప్రాధాన్యము మొదలైనవి పూర్వకవుల రచనలలో ప్రబంధ లక్షణాలు.

## 6. నాయకరాజులయుగము

ఈ యుగంలో వెలువడిన ప్రసిద్ధ కావ్యాలు

తంజావూరు రాజ్యమున వెలసినవి :

రామాయణం, వాల్మీకిచరిత్ర - రఘునాథనాయకుడు.

విజయవిలాసం, సారంగధరచరిత్ర - చేమకూర వేంకటకవి.

మోహశృంగారకావ్యాలు .

రాజగోపాలవిలాసం - చెంగల్వ కాళకవి.

మన్నారుదాసవిలాసం, ఉషాపరిణయం - రంగాజమ్మ.

మధుర రాజ్యమున వెలసినవి :

సత్యభామాసాంత్వనం - లింగనమఖి కామేశ్వరకవి.

రాధికాసాంత్వనం - ముద్దుపళని.

అహల్యాసంక్రదనం - సముఖం వేంకటకృష్ణప్పనాయకుడు.

తారాశశాంకవిజయం - శేషం వేంకటపతి.

చెంజి :

కువలయాశ్వచరిత్ర - సవరం చిననారాయణరాజు.

పుదుక్కోట :

పార్వతీపరిణయం - రఘునాథ తొండమాన్.

ఉత్తరాంధ్రంలో :

బహుళాశ్వచరిత్ర - దామెర్ల వెంగళభూపాలుడు.

రుక్మిణీపరిణయం, రాజశేఖరవిలాసం - కూచిమంచి తిమ్మకవి.

వేమనయోగి - ప్రజాకవి. దేశకాలములు నిశ్చయంగా తెలియవుకాని ఇతడు 17 శతాబ్దము, కడపప్రాంతమునకు చెందినవాడు కావచ్చును. ఆటవెలదిలో, తేట మాటలలో సంఘదురాచారాలు, మూఢనమ్మకాలను విమర్శించి జీవితపరమార్థాన్ని ప్రజలకు బోధించారు.

## వచనకావ్యాలు

ప్రబంధయుగంవరకు కావ్యం అంటే పద్యకావ్యం అనే అర్థం. వచన రచన ఒక ప్రజ్ఞకాదని అప్పటివారు భావించేవారు. 16, 17 శతాబ్దంనుంచి వచన గ్రంథాలు బయలుదేరాయి. మధుర రాజుల ఆశ్రయంలో వచన రచన బాగా అభివృద్ధి చెందింది. ఇది - జనసామాన్యానికి అందుబాటులో వుండేటట్లు వాడుకభాషలో వ్రాయబడినవి కొన్ని, విద్యావంతులకోసం గ్రాంథికభాషలో వ్రాయబడినవి కొన్ని.

వ్యవహారికభాషారచనలు :

మాఘమాహాత్మ్యం, శ్రీరంగమాహాత్మ్యం - విజయరంగ చొక్కనాథుడు

గ్రాంథికభాషారచనలు :

విష్ణుపురాణం - తుపాకుల అనంతభూపాలుడు.
ధేనుమాహాత్మ్యం - లింగనమఖి కామేశ్వరకవి.
జైమినీభారతం, సారంగధరచరిత్ర - సముఖం వేంకటకృష్ణప్పనాయకుడు.
హాలాస్యమాహాత్మ్యం - రామభద్రకవి.

ఇవిగాక భారత భాగవత రామాయణములకు పెక్కు వచనానువాదాలు వెలువడ్డాయి. కొందరు రచయితలు ఆంధ్రీకరణములను మూలంగా తీసికొని అనువదించారు. కొందరు సంస్కృత మూలములను అనువదించారు.

## యక్షగానాలు

యక్షులనే జాతివారు కులవృత్తిగా గ్రహించి చేసిన గానము, ఆడిన ప్రదర్శనము యక్షగానంగా ప్రసిద్ధికెక్కింది. మొదట నృత్యగీతప్రధానమై క్రమంగా ఇది సంభాషణాత్మకమైన రూపకమయింది.

యక్షగానం దేశీయమైన రూపక రచన. మార్గరూపకమున కున్నట్లు దీనికి నిర్దిష్టమైన లక్షణం లేదు. ఇందులో అనేకవిధాలైన గేయ రచనలు చేర్తాయి

రాయలకాలంలో యక్షగాన ప్రదర్శనలపై అభిరుచి పెరగడంవలన కొందరు భాగవత మేళాలుగా ఏర్పడి సంచారం చేస్తూ ప్రదర్శన లిచ్చేవారు. మనకు లభించిన మొదటి యక్షగానం రాయలకాలంనాటి రుద్రకవి రచించిన సుగ్రీకవిజయం.

తంజావూరు నాయకరాజులు యక్షగానములను ప్రోత్సహించారు. రఘునాథ నాయకుని రుక్మిణీకృష్ణ వివాహయక్షగానం అలభ్యము. విజయరాఘవనాయకుని యక్షగానాలు 20 దాకా వున్నాయి. రాజగోపాలవిలాస నాటకము, ఉషాపరిణయ నాటకము, రఘునాథాభ్యుదయ నాటకము, మోహినీవిలాస నాటకము, పూతనాహరణ నాటకము, మొదలైనవి.

ఇతరకవుల రచనలు :

మన్నారుదాసవిలాసనాటకం - రంగాజమ్మ.

తంజాపురాన్నదానమహానాటకం }
విజయరాఘవకల్యాణం } కోనేటి దీక్షితుడు.

విజయరాఘవుని కుమారుడు మన్నారుదేవుడు హేమాబ్జనాయికా స్వయంవరము వ్రాశాడు.

మధురలోని కవుల రచనలు అలభ్యములు.

మహారాష్ట్ర రాజులు స్వయంగా యక్షగాన కర్తలై ఆస్థానకవులచే అనేక యక్షగానములను రచింపజేశారు.

యక్షగానంలోని దేశీయ రచనారీతు లిప్పటికీ పామరజనస్త్రీలు పాడుకునే పాటల్లో నిలిచివున్నాయి.

## 7. సంధియుగము

ఈ యుగంలోని కొన్ని ప్రసిద్ధ కావ్యాలు :

హంసవింశతి - అయ్యలరాజు నారాయణకవి.

శుకసప్తతి - పాలవేకరి కదిరీపతి. ఈ రెండూ కథాకావ్యాలు. ఇవి నాటి సాంఘిక పరిస్థితులను చక్కగా ప్రదర్శిస్తున్నాయి.

సీతారామాంజనేయసంవాదం - పరశురామపంతుల లింగమూర్తి. వేదాంత గ్రంథం.

వేదాంతరసాయనం - మంగళగిరి ఆనందకవి. క్రీస్తు జీవిత కథ.

రంగరాయచరిత్ర - దిట్టకవి నారాయణకవి. ఇది బొబ్బిలియుద్ధమును (1757) వర్ణించే వీరరసప్రధానమైన కావ్యం.

రామాయణం - వావిలికొలను సుబ్బారావు. ఇతడు ఒంటిమిట్ట కోదండ రామస్వామి భక్తుడు.

సీజరుచరిత్ర - వావిలాల వాసుదేవశాస్త్రి. ఆంగ్లమునుండి అనువాదము.

భారత భాగవత రామాయణములు - శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి. యథామాతృ కామవాదాలు.

నానారాజసందర్శనం - తిరుపతి వేంకటకవులు.

కొన్ని ప్రసిద్ధ శతకాలు :

సూర్యశతకం - ఝంఝామారుతము వేంకటసుబ్బకవి.

భక్తచింతామణిశతకం - వడ్డాది సుబ్బారాయడు.

కొన్ని ప్రసిద్ధ యక్షగానాలు :

నౌకాచరిత్రం - త్యాగరాజు.

ధర్మపురి రామాయణం - శేషాచలకవి.

కొందరు వాగ్గేయకారులు :

త్యాగరాజు - తన కీర్తనలకు రాగం నిర్ణయించటంలో శ్రద్ధవహించారు.

శ్యామశాస్త్రి - త్యాగరాజువలెనే అనేక కీర్తనలు రచించారు.

పోతులూరి వీరబ్రహ్మం - తత్వాలు (వేదాంతపదములవంటివి).

కొన్ని ప్రసిద్ధ నాటకాలు :

మంజరీమధుకరీయం - కోరాడ రామచంద్రశాస్త్రి. ఇది తెలుగులో మొదటి స్వతంత్ర నాటకం.

ప్రతాపరుద్రీయము, బొబ్బిలియుద్ధము - వేదం వేంకటరాయశాస్త్రి.

విషాదసారంగధర, చిత్రనళీయము - ధర్మవరం రామకృష్ణమాచార్యులు.

గయోపాఖ్యానం - చిలకమర్తి లక్ష్మీనరసింహం.

పాండవోద్యోగవిజయాలు - తిరుపతి వేంకటకవులు.

కన్యాశుల్కం - గురజాడ అప్పారావు.

వచన రచన :

మొదట్లో వేదాంత, మత, శాస్త్రగ్రంథములు వాడుకభాషలో వ్రాయబడేవి. చిన్నయసూరి కాలంనుంచి కళాశాలల్లో గ్రాంధిక రచనలు పాఠ్యగ్రంథములుగా ఉపయుక్తం కావడంతో గ్రాంధిక రచనకు ప్రాధాన్యము, వ్యాప్తి ప్రాప్తించింది.

ఈ యుగంలో కందుకూరి వీరేశలింగము పాశ్చాత్య పండితులు ఆంధ్రభాషా వాఙ్మయములకు చేసిన సేవ అమూల్యమైనది.

## 8. ఆంధ్ర కావ్యరచనాసంప్రదాయాలు

1. శ్రీకారంతో కావ్యాన్ని ప్రారంభించటం - శ్రీ = లక్ష్మి, మంగళదేవత. శ్రీ - విశేషణరూపంనుండి ఏర్పడినవే శ్రేయస్>శ్రేయస్సు, శ్రేష్ఠ>శ్రేష్ఠము శబ్దాలు. మూడువేల సంవత్సరములనుండి భాషలో అత్యధికమైన వాడుకగల శబ్దం ఇది.

2. ఇష్టదేవతాస్తుతి - నన్నయ భారతరచన సంస్కృతంలో త్రిమూర్తిస్తుతితో ప్రారంభ మవుతుంది తిక్కన తన భారతంలో తెనుగుపద్యంతో హరిహరనాథుని స్తుతించాడు సామాన్యంగా ఇష్టదైవంతోపాటు గణేశ సరస్వతీస్తుతి కావ్యాదిని వుంటుంది నాచనసోమనతో కృత్యాది పద్యంలో శృంగారం ప్రవేశించింది.

3. పూర్వకవిస్తుతి - తెలుగు వాఙ్మయం ప్రాయికంగా అనువాద వాఙ్మయం కనుక సంస్కృత కవులను స్మరించటం అవశ్యాచరణీయ మయింది. తెలుగు కవులలో నన్నయను తిక్కన, నన్నయ తిక్కనలను ఎర్రన, కవిత్రయమును అనంతర కవులు స్తుతించారు.

భిన్నమతాభినివేశముచేత పాల్కురికి సోమనాథాది శివకవులు భవికవులను స్మరించలేదు; వారిని వీరూ స్మరించలేదు.

4. కవితాశయములు - కొందరు కవులు స్వీయకవితా ధర్మములను చెప్పుకొన్నారు నన్నయ తన రచనలో ప్రసన్న కథా కలితార్థయుక్తి, అక్షర రమ్యత అనువానిని ప్రత్యేకింగా పేర్కొన్నాడు. కొందరు సాహిత్య ధర్మములను సాధారణంగా చెప్పి తమ కవితలో ఇవి ఉన్నాయని ధ్వనింపజేశారు. ఉదా— పాల్కురికి సోమన. అల్పాక్షరముల ననల్పార్థరచన కావించుటయకాదె కవివివేకంబు, అని.

5. కుకవి నిరసనము - కావ్యావతారికలో ఇదికూడా ఒక సంప్రదాయంగా ఏర్పడింది. నన్నిచోడుడు కుమారసంభవంలో 'చెరకు విడిచిన రసమున కెరగిరాక పిప్పి కరిగెడు నీగలపెల్లువోలె' అని కుకవులను ఈగలతో పోలుస్తాడు.

6. సప్తసంతానప్రతిష్ఠ - పుత్రుడు, దేవాలయము, తటాకము, నిధి, వనము, అగ్రహారము, కృతి - ఇవి సప్తసంతానములు. వీటిని ప్రతిష్ఠించటంవలన యశస్సు, యశస్సువలన స్వర్గలోకనివాసము కలుగుతుందని మనవారి విశ్వాసం. వీటిలో కాలవశమున ఖిలముగాకుండునది కృతి ఒక్కటే గనుక సప్తసంతానాల్లో కృతియే ఉత్తమసంతానంగా భావింపబడింది.

అంకితమిచ్చుట - సర్వలక్షణ లక్షితమైన కావ్యమును కుమార్తెగా భావించి కృతిపతికి అంకితమివ్వటమనేది తెలుగు వాఙ్మయంలో ఒక విశిష్టమైన సంప్రదాయం. ఇది తిక్కనకాలంనుంచి కనబడుతున్నది. నన్నయ రాజరాజుకు భారతం వినిపించెనేకాని అంకితమివ్వలేదు. తిక్కన నిర్వచనోత్తర రామాయణాన్ని తన ప్రభువైన మనుమసిద్ధికి అంకితమిచ్చాడు.

కవికి కృతి కుమార్తె. కాగా కృతిభర్త అల్లు డవుతాడు. ఆనాడు సంఘంలో కృతిపతిత్వం గౌరవహేతువు. కృతిప్రదానం కన్యాదానంవలె ఒక ఉత్సవంగా జరిగేది. రాజులు, వారి ననుసరించి ప్రభుత్వోద్యోగులు 'మన్నామాంకితంబుగా కృతిసెప్పు' మని కవిని అర్థించేవారు నామాంకితమనే మాట వ్యవహారంలో 'అంకిత'మై అంకితముచేయటమనే పలుకుబడి ఏర్పడింది. కొందరు కవులు ప్రభువునకు గాక గురువునకో ఇష్టదైవమునకో అంకితం చేశారు

కేవలము ధనార్జనపరులైన కవులూ కొందరున్నారు. వారిని నిరసిస్తూ చెప్పిన పద్యాలు 'బాలరసాలసాల ' వంటివి.

7. షష్ఠ్యంతములు - వివాహంలో ఉభయకులప్రశంస ఉన్నట్లు కావ్యావతారికలో కృతిపతి కృతికర్తృ వంశవర్ణనం వుంటుంది. కృతిపతి గుణములను షష్ఠ్యంత విశేషణములతో కందపద్యాల్లో వర్ణించటం తెలుగు వాఙ్మయంలో ఒక ప్రత్యేకమైన ఆచారంగా ఏర్పడింది.

8 ఆశ్వాసాంతపద్యాలు - ఆశ్వాసాంతంలో వృత్తము, తరువాత కందము, ఆటుతరువాత ఒక విశేషవృత్తము (మాలిని, స్వాగతము మొదలైనవి వాడతారు

ఆశ్వాసాద్యంతాల్లో కృతిపతి సంబోధన వుంటుంది.

ఆశ్వాసాంతగద్య - ఆశ్వాసం సమాప్తమైనట్లు చెప్పే ఆశ్వాసాంతగద్యలో సంగ్రహంగా కథావిషయము కవినామము చెప్పబడుతుంది. సాహిత్యవిషయం కూడా ఉండవచ్చును ఆశ్వాసాంతగద్యలో కాలక్రమమున స్వోత్కర్ష పెరిగింది. ఈ స్వోత్కర్షకు నాచన సోమన ఆద్యుడు. నన్నయ తిక్కన సోమనల ఆశ్వాసాంత గద్యలను పోల్చిచూడండి:

నన్నయ - సకల సుకవిజనవినుత నన్నయభట్టు (ఆంధ్రమహాభారతం).

తిక్కన - శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర బుధారాధనవిరాజి తిక్కన సోమయాజి (ఆంధ్రమహాభారతం).

నాచన సోమన - శ్రీమత్ సకలభాషాభూషణ సాహిత్యరసపోషణసంవిధాన చక్రవర్తి సంపూర్ణకీర్తి నవీనగుణసనాథ నాచన సోమనాథుడు (ఉత్తరహరివంశం).

కృష్ణదేవరాయలు ఆముక్తమాల్యదలో ఆశ్వాసాంతమున ఇతర కవులవలె గద్యమును చెప్పక పద్యం చెప్పి తన రాచఠీవిని ప్రకటించుకొన్నవాడైనాడు.

## 9. తెలుగువ్యాకరణం - కావ్యభాష

నన్నయ ఆంధ్రశబ్ద చింతామణి వ్రాయుటంచేత శబ్దశాసనబిరుదం కలిగిందని పూర్వపండితుల అభిప్రాయం నన్నయకు శబ్దశాసన బిరుదం ప్రౌఢకవిత్వరచనచేత వచ్చిందిగాని వ్యాకరణరచనచేత రాలేదు ఆంధ్రశబ్దచింతామణి మధ్యయుగంలో రచింపబడి వుంటుంది. దీనికి పూరకగ్రంథం అధర్వణవారికావళి. ఈ రెండింటిపై వ్యాఖ్యానం అహోబల పండితీయం. సూత్రము, కారిక, వ్యాఖ్య - మూడూ సంస్కృతంలో వున్నాయి నాడు సంస్కృత రచన గౌరవహేతువు.

లక్షణం తెలుగుపద్యంలో చెప్పడం దేశీయసంప్రదాయం. ఈ సంప్రదాయానికి చెందిన రచనలు కేతన ఆంధ్రభాషాభూషణం (13 వ శతా), పెద్దన కావ్యాలంకార చూడామణి (1404), గణపవరపు వెంకటకవి - సర్వలక్షణ శిరోమణి (17 వ శతా.) మొదలైనవి పెద్దన వ్యాకరణ ఛందోలంకారాలు మూడూ చెప్పాడు మార్గనాటకం మనకు లేదు.కనుక ఇతడు నాటకలక్షణం చెప్పలేదు.

16 వ శతాబ్దంలో రామరాజభూషణుడు కావ్యాలంకారసంగ్రహ మనే కావ్య శాస్త్ర గ్రంథమును రచించాడు. దీనిలోను నాటక ప్రకరణం లేదు.

కావ్యశాస్త్రమునకు అలంకారశాస్త్ర మని పేరు

## కావ్యభాష

నన్నయ తనకాలంలో ఉన్న శిష్టభాషలో భారతం రచించాడు నన్నయ ప్రయోగమును తిక్కన ఎర్రనలు ఈ కవిత్రయమును అనంతర కవులు అనుసరించారు భారత భాషను ప్రయత్నపూర్వకంగా అభ్యసించి భాటతరచనా సంప్రదాయాలను పాటించడం వలన కావ్యభాష అన్నది ఒకటి ఏర్పడింది ఈభాష వ్యావహారికభాషకు దూరంగానే వుంటూవచ్చింది. నన్నయనుండి చిన్నయవరకు భాష ఒక్కవిధంగానే వున్నదన్న మాటకు అర్థం ఇది, వ్యావహారికభాష మారినంత వేగంగా కావ్యభాష మారదు కనుక కాలక్రమాన వీటికి అంతరం పెరిగింది

అయితే మార్గకవులు పూర్వభాషను ఎంతజాగ్రత్తగా అభ్యసించినా వ్యవహార బలంవలన సమకాలపు వాడుకరూపాలు కొద్దోగొప్పో కావ్యభాషలో ప్రవేశించకపోలేదు మార్గసంప్రదాయానికి భిన్నమైన రచనలలో - అన్నమాచార్యుల రచనలవంటివావిలో - వ్యావహారికరూపాలు బాహాటంగా వాడబడ్డాయి క్రమంగా 16 వ శతాబ్దంనుంచి భాషాసాంకర్యం ఎక్కువయింది. అలాక్షణికప్రయోగాలు, అపశబ్దాలూ, శబ్దముల సాధుత్వాసాధుత్వములనుగూర్చిన చర్చలూ, అభిప్రాయభేదాలూ - ఇవన్నీ ఎక్కడైనా జీవద్భాషా వాఙ్మయానికి తప్పనట్లే తెలుగుకీ తప్పలేదు.

భాష ఇంతగా మారినప్పుడు ఆధునికభాషే కావ్యరచనోపయోగి కాదగుననే అభిప్రాయం విద్యాధికులలో ఏర్పడి, ఈ శతాబ్ది ప్రారంభంలో ఒక ఉద్యమరూపం దాల్చింది. తత్ఫలితంగా నేడు కవులు, రచయితలు ఆధునికభాషనే వాడుతున్నారు. విద్యాలయాల్లోను పఠనపాఠనాల్లో అధునికభాష అంగీకరింపబడింది.

# 10. ఆంధ్రవాఙ్మయము - కొన్ని వివరాలు

## చారిత్రిక కావ్యాలు

సిద్ధేశ్వరచరిత్ర - 16 శతా. కాసె సర్వప్ప

కాకతీయరాజవంశచరిత్ర

కృష్ణరాయవిజయము - 16 శతా. కుమారధూర్జటి
కృష్ణదేవరాయచరిత్ర.

రామరాజీయము - 17 శతా అందుగుల వెంకయ్య
ఆర్వీటిరాజుల వంశచరిత్ర.

రంగరాయచరిత్ర - 18 శతా దిట్టకవి నారాయణకవి
1757 లో జరిగిన బొబ్బిలియుద్ధ వృత్తాంతము.

తొండమాన్ వంశావళి - 19 శతా. నుదురుపాటి వెంకనార్యుడు
తొండమాన్ రాజుల చరిత్ర

వెలుగోటివారి వంశావళి - 18 శతా. వెలమదొరలమీది చాటువులు.

## శాస్త్రగ్రంథాలు

సంస్కృత గ్రంథాలను తెలుగు కవులు పద్యకావ్యాలుగానే అనువదించారు.

గణితశాస్త్రము - 11 శతా. పావులూరి మల్లన.

ధర్మశాస్త్రము - 13 శతా (విజ్ఞానేశ్వరీయం) కేతన.

హయశాస్త్రము - 15 శతా మనుమంచిభట్టు.

కళాశాస్త్రము - 16 శతా. (కొక్కోకము) కూచిరాజు ఎర్రన.

19 వ శతాబ్దంలో తత్వశాస్త్రగ్రంథాలు వచనంలో - వాడుకభాషలో వచ్చాయి.

## నిఘంటువులు

ప్రాచీన తెలుగు నిఘంటువులు సంస్కృతంలో అమరసింహుని నామలింగానుశాసనం పద్ధతిలో రచింపబడ్డాయి అవి పదజాలాన్ని కొన్ని వర్గాలుగా ఏర్పరచి వాటికి సమాన పదాలు పేర్కొన్నవి.

వేంకటేశాంధ్రము - 16 శతా. గణపవరపు వేంకటకవి.

ఆంధ్రభాషార్ణవము - 16 శతా నుదురుపాటి వేంకనార్యుడు.

ఆంధ్రనామసంగ్రహము - పైడిపాటి లక్ష్మణకవి.

ఆంధ్రనామశేషము - 18 శతా అడిదము సూరకవి.

సాంబనిఘంటువు - 18 శతా. కస్తూరిరంగకవి.

19 వ శతాబ్దంలో ఆంగ్లపద్ధతిని అకారాదిక్రమంలో నిఘంటువులు కూర్చబడినవి. వీటిలో బహుజనపల్లి సీతారామాచార్యులవారి ఆంధ్రశబ్దరత్నాకరం మొదటి ప్రామాణిక రచన.

## నష్టగ్రంథాలు

కావ్యావతారికలను బట్టి, లక్షణ గ్రంథములు మరియు సంకలన గ్రంథములను బట్టి తెలుగులో ఎన్నో కావ్యాలు నష్టమై పోయినట్లు తెలుస్తూంది.

మనదేశపు ఉష్ణవాతావరణంలో తాటాకు గ్రంథాలు ఎక్కువకాలం ఉండవు. మహమ్మదీయ దండయాత్రలలో, అప్పటి అరాచక పరిస్థితులలో అనేక గ్రంధాలు, గ్రంధాలయాలు నశించిపోయాయి. ప్రాచీనులకు పురాణాలపైవున్న భక్తిశ్రద్ధలు కావ్యములమీద లేకపోవడంచేత కావ్యాలకు ప్రతులు అంతగా బయలుదేరలేదు. నష్టవాఙ్మయంలో కావ్యాలు ఎక్కువ.

## సభాభవనముల పేర్లు

వీరభద్రారెడ్డి సభాభవనం - త్రైలోక్యవిజయం.

కృష్ణరాయల సభాభవనం - భువనవిజయం.

రఘునాథరాయల సభాభవనం - ఇందిరామందిరం.

## రాజకవులు

నన్నిచోడుడు - 12 శతా. పాకనాటి ప్రభువు.

బద్దెన (భద్రభూపాలుడు) - 14 శతా.

కృష్ణదేవరాయలు - 16 శతా విజయనగర చక్రవర్తి.

రఘునాథరాయలు - 17 శతా. తంజావూరు నాయకరాజు.

విజయరాఘవనాయకుడు - 17 శతా ,,

విజయరంగ చొక్కనాధుడు - 17 శతా మధుర నాయకరాజు.

ఇంకా తంజావూరు మహారాష్ట్రరాజులు మైసూరురాజులు తెలుగుకావ్యములను రచించినవా రున్నారు.

## కవయిత్రులు

తాళ్లపాక తిమ్మక్క - 15 శతా. సుభద్రాకల్యాణం.

మొల్ల - 16 శతా. రామాయణం.

రంగాజమ్మ - 17 శతా. మన్నారుదాసవిలాసనాటకం.

ముద్దుపళని - 18 శతా. రాధికాసాంత్వనం.

తరిగొండ వేంకమాంబ - 19 శతా. వేంకటాచలమాహాత్మ్యం.

## కవుల బిరుదాలు

నన్నయ - వాగనుశాసనుడు.

నన్నిచోడుడు - కవిరాజశిఖామణి.

తిక్కన - కవిబ్రహ్మ, ఉభయకవిమిత్రుడు.

కేతన - అభినవదండి.

ఎఱ్ఱన - ప్రబంధపరమేశ్వరుడు.

నాచనసోమన - నవీనగుణసనాథుడు, సాహిత్యరసపోషణసంవిధానచక్రవర్తి.

శ్రీనాథుడు - కవిసార్వభౌముడు.

అన్నమాచార్యులు - పదకవితాపితామహుడు.

అల్లసానిపెద్దన - ఆంధ్రకవితాపితామహుడు.

భట్టుమూర్తి - రామరాజభూషణుడు. (ఈ బిరుదునామం క్రమంగా వ్యవహారనామ మయింది), సంగీతకళారహస్యనిధి, శ్లేషకవిచక్రవర్తి.

## కవుల విశిష్ట కవితాలక్షణాలు

నన్నయ - ప్రసన్నకథాకలితార్థయుక్తి, అక్షరరమ్యత, శైలీగాంభీర్యము.

నన్నిచోడుడు - వస్తుకవిత.

తిక్కన - అర్థపుష్టి, కావ్యశిల్పనైపుణ్యము, నాటకీయత, మనస్తత్వపరిశీలనము.

నాచనసోమన - 'నవీనగుణములు'.

ఎఱ్ఱన - సూక్తివైచిత్రి.

శ్రీనాథుడు - ఉద్ధతశయ్య, సీసపద్యముల తూగు.
పోతన - శబ్దాలంకారవైభవము.
కృష్ణరాయలు - భావప్రౌఢత, వర్ణనాప్రాగల్భ్యము.
అల్లసానిపెద్దన - అల్లికజిగిబిగి.
ముక్కుతిమ్మన - ముద్దుపలుకు.
తెనాలిరామకృష్ణుడు - పదగుంభనము.
పింగళిసూరన - కథాకల్పనాశక్తి.
రామరాజభూషణుడు - శ్లేష, అలంకృతి.
చేమకూర వేంకటకవి - ప్రతిపద్య చమత్కృతి.

## కవి - అభిమానపద్యము

తిక్కన - కందము.
తాళ్లపాక చిన్నన్న - ద్విపద.
శ్రీనాథుడు - సీసము.
వేమన - ఆటవెలది

## కనకాభిషేక గౌరవంపొందిన కవులు

శ్రీనాథుడు - 15 శతా. విజయనగర ప్రౌఢదేవరాయల ఆస్థానంలో.
రంగాజమ్మ - 17 శతా. తంజావూరు విజయరాఘవనాయకుని ఆస్థానంలో.

## భాషాంతరీకరణమయిన తెలుగుకావ్యాలు

పాల్కురి సోమన బసవపురాణం - కన్నడంలోనికి.
రామరాజభూషణుని వసుచరిత్ర - తమిళం, సంస్కృతంలోనికి.
వేమన పద్యాలు - దేశ విదేశీయభాషలలోనికి.

## ఆంధ్రులకు మెచ్చుగొలిపే కావ్యపాత్రలు

మనుచరిత్రలో - వరూధిని, ప్రవరాఖ్యుడు.
పాండురంగమాహాత్మ్యంలో - నిగమశర్మ అక్క.

ప్రభావతీప్రద్యుమ్నంలో - శుచిముఖి.

కళాపూర్ణోదయంలో - కలభాషిణి.

ఆధునికవాఙ్మయమున వేదం వేంకటరాయశాస్త్రిగారి ప్రతాపరుద్రీయనాటకంలో పేరిగాడు, గురజాడ అప్పారావుగారి కన్యాశుల్కంలో మధురవాణి, గిరీశం.



## అనుబంధము

### మీ స్వంత గ్రంధాలయంలో ముఖ్యంగా ఉండవలసిన తెలుగుపుస్తకాలు

1. ఆంధ్రమహాభారతము.
2. ఆంధ్రమహాభాగవతము.
3. రంగనాధరామాయణము.
4. శృంగారనైషధము.
5. ఆముక్తమాల్యద.
6. మనుచరిత్ర.
7. వసుచరిత్ర.
8. కళాపూర్ణోదయము.
9. విజయవిలాసము.
10. నానారాజసందర్శనము.
11. వేమనపద్యాలు.
12. సుమతిశతకము.
13. త్యాగరాజుకీర్తనలు.
14. తెనాలి రామలింగని కథలు.
15. ప్రతాపరుద్రీయనాటకము.
16. కన్యాశుల్కము.



# ఆంధ్రవాఙ్మయ పరిచయము
# ప్రసిద్ధపద్యాలు

ఆంధ్రమహాభారతము నన్నయ (11 వ శతా.) కావ్యారంభంలో మంగళశ్లోకం

త్రిమూర్తిస్తుతి

శ్రీవాణీగిరిజా శ్చిరాయ దధతో వక్షోముఖాంగేషు యే
లోకానాం స్థితి మావహ న్త్యవిహతాం స్త్రీపుంసయోగోద్భవాం
తే వేదత్రయమూ ర్తయ స్త్రిపురుషా స్సంపూజితా వస్సురై
ర్భూయాసుః పురుషో త్తమాంబుజభవ శ్రీకంధరా శ్శ్రేయసే.

ఎవరు అనాదిగా లక్ష్మి సరస్వతి పార్వతులను వక్షస్థలమునందును ముఖమునందును శరీరమునందును ధరించుచున్నవారై లోకములను నిరంతరాయముగ నిర్వహించుచున్నారో అట్టి మూడు వేదములను ఆకారముగా ధరించినవారును, దేవతలచే ఆరాధింపబడువారును అగు విష్ణువు బ్రహ్మ శివుడు అను ముగ్గురు పురుషులు మీకు శ్రేయస్సును కలిగింతురుగాక!

## నన్నయకవిత్వము

సారమతిం గవీంద్రులు ప్రసన్నకథాకలితార్థయుక్తి లో
నారసి మేలునా, నితరు లక్షరరమ్యత నాదరింప నా
నారుచిరార్థసూక్తినిధి నన్నయభట్టు దెనుంగునన్ మహా
భారతసంహితారచనబంధురుఁ డయ్యె జగద్ధితంబుగన్.

## భారతము - విశ్వజనీనత

ధర్మతత్త్వజ్ఞులు ధర్మశాస్త్రంబని
యధ్యాత్మవిదులు వేదాంతమనియు

నీతివిచక్షణుల్ నీతిశాస్త్రంబని
కవివృషభులు మహాకావ్యమనియు
లాక్షణికులు సర్వలక్షణ సంగ్రహమని
యైతిహాసికు లితిహాస మనియుఁ
బరమ పౌరాణికుల్ బహుపురాణ సముచ్చ
యంబని మహిఁ గొనియాడుచుండ

వివిధవేదతత్త్వవేది వేదవ్యాసుఁ
డాదిముని పరాశరాత్మజుండు
విష్ణుసన్నిభుండు విశ్వజనీనమై
పరఁగుచుండఁ జేసె భారతంబు.

బ్రాహ్మణ క్షత్రియ స్వభావాలు

వెండుమనంబు నవ్యనవనీతసమానము, పల్కు దారుణా
ఖండలశస్త్రతుల్యము, జగన్నుత ! విప్రులయందు ; నిక్క, మీ
రెండును రాజులందు విపరీతము గావున విప్రుఁడోపు, నో
పం డతిశాంతుఁ డయ్యు నరపాలుఁడు శాపము గ్రమ్మఱింపఁగన్.

నాగపతిస్తుతి

బహువనపాదపాబ్ధి కులపర్వతపూర్ణసరస్సరస్వతీ
సహిత మహామహీభర మజస్రసహస్రఫణాళిఁ దాల్చి, దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకు బ్రసన్నుఁ డయ్యెడున్.

యయాతి దేవయానిని నూతినుండి ఉద్ధరించుట

జలధివిలోలవీచి విలసత్కలకాంచి సమంచితావనీ
తలవహనక్షమం బయిన దక్షిణహస్తమునం దదున్నమ
ద్గళ దురు ఘర్మవారికణక్రమకరాబ్జము వట్టి నూతిలో
వెలువడఁ గోమలిం దిగిచె విశ్రుతకీర్తి యయాతి ప్రీతితోన్.

యయాతి పూరునకు బోధించిన నీతులు

ఎఱుకగలవారి చరితలు
గఱచుచు సజ్జనుల గోష్ఠిఁ గదలక ధర్మం
బెఱుఁగుచు నెఱిఁగినదానిని
మఱవ కనుష్ఠించునది సమంజస బుద్ధిన్.

ఇచ్చునది ధనము పాత్రున
కచ్చుగ నొరు వేడకుండునది సమంజస బుద్ధిన్
వచ్చిన యాశార్థుల వృథ
పుచ్చక చేయునది సర్వభూత ప్రీతిన్.

దుష్టులకు కలిగే అనర్థాలు

తగునిది తగదని యెదలో
వగవక సాధులకుఁ బేదవారల కెగ్గుల్
మొగిఁ జేయు దుర్వినీతుల
కగు ననిమిత్తాగమంబులైన భయంబుల్.

సభలలో మాటాడవలసిన రీతి

మనమునకుఁ బ్రియంబును హిత
మును బథ్యముఁ దథ్యమును నమోఘము మధురం
బును బరిమితమును నగు పలు
కొనరఁగఁ బలుకునది ధర్మయుతముగ సభలన్.

సూనృత వాక్యము విలువ

నుతజలపూరితంబులగు నూతులు నూఱిటికంటె సూనృత
వ్రత ! యొక బావి మేలు, మఱి బావులు నూఱిటికంటె నొక్క స
త్క్రతు వది మేలు, తత్క్రతుశతంబునకంటె సుతుండు మేలు, త
త్సుతశతకంబుకంటె నొక సూనృతవాక్యము మేలు చూడఁగన్.

అహితులైన చుట్టాలకు దూరంగా ఉండటం మేలు

కులపాంసనులై యహితం
బులె సేయుచునుండు చుట్టములఁ బొందక యి
మ్ముల నుండువాఁడ పుణ్యుఁడు
వెలయఁగ గ్రామస్థితైక వృక్షముపోలెన్.

ధర్మరాజు వైభవం

మదమాతంగ తురంగ కాంచన లసన్మాణిక్యగాణిక్య సం
పద లోలిం గొనివచ్చి యిచ్చి ముదమొప్పం గాంచి సేవించి ర
య్యుదయాస్తాచల సేతు శీతనగ మధ్యోర్వీపతుల్ సంతతా
భ్యుదయున్ ధర్మజుఁ దత్ప్రభాస్థితు జగత్పూర్ణ ప్రతాపోదయున్.

ద్రౌపదీ పరాభవం - భీముని ప్రతిజ్ఞ

కురువృద్ధుల్ గురువృద్ధబాంధవు లనేకుల్ సూచుచుండన్ మదో
ద్ధతుఁడై ద్రౌపది నిట్లు సేసిన ఖలున్ దుశ్శాసనున్ లోకభీ
కరలీలన్ వధియించి తద్విపులవక్షశ్శైల రక్తౌఘని
ర్ఝర ముర్వీపతి సూచుచుండ నని నాస్వాదింతు నుగ్రాకృతిన్.

ధారుణి రాజ్యసంపద మదంబునఁ గోమలిఁ గృష్ణఁ జూచి రం
భోరు నిజోరుదేశమున నుండఁగఁ బిల్చిన యిద్దురాత్ము దు
ర్వారమదీయబాహు పరివర్తిత చండగదాభిఘాత భ
గ్నోరుతరోరుఁ జేయుదు సుయోధను నుగ్రరణాంతరంబునన్.

శారదరాత్రుల వర్ణన - నన్నయ రచనలో చివరిపద్యం

శారదరాత్రు లుజ్జ్వలలసత్తర తారకహార పంక్తులన్
జారుతరంబు లయ్యె వికసన్నవ కైరవగంధ బంధురో
దారసమీర సౌరభము దాల్చి సుధాంశు వికీర్యమాణ క
ర్పూరపరాగ పాండు రుచిపూరము లంబరపూరితంబులై.

ఎఱ్ఱనకవిత్వము

శరత్సమయశోభ - ఎఱ్ఱన రచనలో మొదటి పద్యం

స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై దళత్కమల వైభవజృంభణ ముల్లసిల్ల, ను
ద్ధురతరహంస సారస మధువ్రత నిస్వనముల్ సెలంగఁగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్.

భారతీస్తుతి

అంబ! నవాంబుజోజ్జ్వల కరాంబుజ! శారద చంద్రచంద్రికా
డంబర చారుమూర్తి! ప్రకటస్ఫుటభూషణ రత్నరోచిరా
చుంబిత దిగ్విభాగ! శ్రుతిసూక్త వివిక్తనిజప్రభావ! భా
వాంబరవీధి విశ్రుతవిహారి! ననుం గృపఁ జూడు భారతీ!

తిక్కన

విరాటపర్వం - హరిహర స్తుతి

శ్రీ యన గౌరినాఁ బరఁగు చెల్వకుఁ జిత్తము పల్లవింప భ
ద్రాయితమూర్తియై హరిహరంబగు రూపము దాల్చి 'విష్ణురూ
పాయ నమశ్శివాయ' యని పల్కెడు భక్తజనంబు వైదిక
ధ్యాయిత కిచ్చు మెచ్చు పరతత్త్వముఁ గొల్చెద నిష్టసిద్ధికిన్.

తిక్కన కృతి వ్యాసస్తుతి

విద్వత్సంస్తవనీయ భవ్యకవితావేషుండు, విజ్ఞాన సం
పద్విఖ్యాతుఁడు, సంయమిప్రకర సంభావ్యానుభావుండు, గృ
ష్ణద్వైపాయనుఁ దర్థిలోకహితవిష్ఠం బూని కావించె ధ
ర్మాద్వైతస్థితి భారతాఖ్యమగు లేఖ్యంబైన యామ్నాయమున్.

భారతప్రశస్తి

వేదములకు నఖిలస్మృతి
వాదములకు బహుపురాణ వర్గంబులకున్

వాదైన చోటులను దా
మూదల ధర్మార్థకామ మోక్షస్థితికిన్.

సైరంధ్రి కీచకునితో పలికిన పరుష వాక్యములు

దుర్వారోద్యమ బాహువిక్రమ రసాస్తోక ప్రతాపస్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతు లేవు రిప్పు నిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మానముఁ బ్రాణముం గొనుట తథ్యం బెమ్మెయిన్ గీచకా!

ధర్మరాజు గుణగరిమ

ఎవ్వనివాకిట నిభమదపంకంబు
రాజభూషణ రజోరాజి నడఁగు
నెవ్వనిచారిత్ర మెల్లలోకములకు
నొజ్జయై వినయంబు నొఱపు గఱపు
నెవ్వనికడగంట నివ్వటిల్లెడు చూడ్కి
మావితసంపద లీనుచుండు,
నెవ్వనిగుణలత లేడు వారాసుల
కడపటి కొండపైఁ గలయఁ బ్రాకు,

నతఁడు భూరిప్రతాపమహాప్రదీప
దూరవిఘటిత గర్వాంధకారవైరి
వీరకోటీరమణి ఘృణివేష్టితాంఘ్రి
తలఁడు కేవల మర్త్యుఁడే ధర్మసుతుఁడు.

పార్థుని సమరస్థైర్యము

సింహం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జిత యూథదర్శన సముద్యత్కోపియై వచ్చు నో
జం గాంతారనివాస ఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్.

వచ్చినవాఁడు ఫల్గుణుఁడు'

వచ్చినవాఁడు ఫల్గుణుఁ డవశ్యము గెల్తు మనంగరాదు రా
లచ్చికినై పెనంగిన బలంబులు రెండును గెల్వనేర్చునే
హెచ్చుగుఁ గుందగుం దొడరు వెల్ల విధంబుల కోర్చునట్లుగా
కిచ్చఁ దలంచి యొక్కమెయి నిత్తఱిఁ బొందగు చేతయుం దగున్.

విదురనీతి

బలవంతుఁడు పైనెత్తిన
బలహీనుఁడు, ధనము గోలుపడిన యతఁడు, ప్రము
చ్చిల వేచువాఁడు, గామా
తుల చిత్తుఁడు నిద్రలేక కుందుదు రధిపా!

కోపము నుబ్బును గర్వము
నాపోవక యునికియును దురభిమానము ని
ర్వ్యాపారత్వము నను నివి
కాపురుష గుణంబు లండ్రు కౌరవనాథా!

ధనమును విద్యయు వంశం
బును దుర్మతులకు మదంబుఁ బొనరించును స
జ్జనులైనవారి కడఁకువ
యును వినయము నివియ తెచ్చు నుర్వీనాథా!

విను మధురాహారంబులు
గొనుటయుఁ బెక్కండ్రు నిద్రగూరినయెడ మే
ల్కని యునికియుఁ గార్యాలో
చనముఁ దెరువు నడచుటయును జన దొక్కనికిన్.

పురుషుండు రెండు దెఱఁగుల
ధర నుత్తముఁ డనఁగ బరఁగుఁ దానెయ్యెడలం
బరుసములు వలుకకునికిన్
దురితంబులు వొరయు పనులు దొఱఁగుట కతనన్.

వెలఁది జూదంబు పానంబు వేఁట పలుకు
ప్రల్లదంబును దండంబుఁ బరుసఁదనము
సొమ్ము విష్ప్రయోజనముగ వమ్ముసేత
యనెడు సప్తవ్యసనములఁ జనదు తగుల.

తగిన వేషంబు, తనుఁ దాన పొగడుకొనమి
నొచ్చియును గీఱు పలుకమి యిచ్చి పగవ
కునికి తనకెంత నడవకయున్నఁ బథము
తప్పకుండుట నడవడి కొప్పు సేయు.

చెలిమియుఁ బగయును, దెలివియుఁ
గలఁకయు, ధర్మంబుఁ బాపగతియును, బెంపుం
దులువతనంబును వచ్చును
బలుకుబడిన కాన పొసఁగఁ బలుకఁగ వలయున్.

తనువున విఱిగిన యలుగుల
ననువుగ బుచ్చంగవచ్చు, నతినిష్ఠురతన్
మనమున నాటిన మాటలు
వినుమెన్ని యుపాయములను వెడలునె యదిపా!

నియతతపమును నింద్రియ నిగ్రహంబు
భూరి విద్యయు శాంతికిఁ గారణములు
వాని యన్నింటికంటె మేలైన శాంతి
కారణము లోభ ముడుగుట కౌరవేంద్ర!

రాయబార సందర్భమున ద్రౌపది కృష్ణునితో చెప్పిన మాటలు

వరమునఁ బుట్టితిన్, భరతవంశమున జొచ్చితి, నందు బాండు భూ
వరునకుఁ గోడలైతి, జనవంద్యులఁ బొందితి, నీతి విక్రమ
స్థిరులగు పుత్రులం బడసితిన్, సహజన్ముల ప్రాపు గాంచితిన్
సరసిజనాభ! యిన్నిటఁ బ్రశస్తికి నెక్కినదాన నెంతయున్.

నీవు సుభద్రకంటెఁ గడునెయ్యము గారవముం దలిర్ప సం
భావన చేయు, దిట్టినను, బంకజనాభ! యొకండు రాజసూ
యావభృథంబునందు శుచియై పెనుపొందిన వేణిపట్టి యీ
యేవురుఁ జూడఁగా సభకు నీడ్చెఁ, గులాంగన నిట్లొనర్తురే?

## శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని ఉద్బోధించుట

సారపుధర్మముఁ విమలసత్యముఁ బాపముచేత బొంకుచేఁ
బారముఁ బొందలేక చెడఁబాఱినదైన యవస్థ దక్షలె
వ్వార లుపేక్షసేసి రది వారలచేటగుఁగాని ధర్మని
స్తారకమయ్యు సత్యశుభదాయకమయ్యును దైవ ముండెడిన్.

## దుర్యోధనుని నిశ్చయం

ఏమును వారుఁ బంచికొని యేలుట గల్గదు, వల్కుకుండు మిం
కేమియు, వాడిసూదిమొన యించుక మోపిన యంతమాత్రమున్
భూమి యొనర్చి పాండునృపపుత్రుల కిత్తునె, యెవ్వరైన సం
గ్రామమునన్ జయంబు గొని రాజ్యముసేయుట నిశ్చయించితిన్.

## ధర్మసారము

ఒరు లేయవి యొనరించిన
నరవర! యప్రియము దనమనంబున కగుఁ దా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మపథముల కెల్లన్.

## ఎఱ్ఱన నృసింహపురాణము – పూర్వకవిస్తుతి

భాసుర భారతార్థముల భంగులు నిక్కమెఱుంగ నేరమిన్
గాసటబీసటే చదివి గాథలు ద్రవ్వ తెనుంగువారికిన్
వ్యాసముని ప్రణీత పరమార్థము తెల్లగజేసినట్టి య
భ్యాసన కల్పులం దలఁతు నాద్యుల నన్నయ తిక్కనార్యులన్.

రాధామాధవకవి - కవిత్రయస్తుతి

భారతకావ్యహార మొక భాగము నన్నయభట్టొనర్చె, ము
న్నారమణీయ కావ్యములఁ దక్కిన భాగము సోమయాజి సొం
పార నొనర్చె, రెంటిఁ గలయన్ శివదాసుఁడు మధ్యనాయక
శ్రీ రచియించె శారద ధరింపఁ గవిత్రయకీర్తి మించఁగన్.

భాస్కర రామాయణము - హుళక్కి భాస్కరుడు (13 శతా.)
సీతాదేవి శోకము

అన్నా! లక్ష్మణ! విన్నుఁ బుణ్యనిధి నే నజ్ఞానినై పల్కితిన్
న న్నా పాపము జుట్టుకొనియెన్, నాపాలి దైవంబవై
యిన్నిచుం బరిమార్ప వేగ పఱతేవే, నన్ను రక్షింప మీ
యన్నం గ్రన్ననఁ జీరవే, యరుగవే యత్యుగ్ర శీఘ్రంబునన్.

పావనాకార గోదావరీదేవి నీ
వెఱిగింపవమ్మ రాజేంద్రుతోడ,
నో మాల్యవంత పుణ్యోన్నత గిరినాథ
చెప్పఁగదే రాజసింహుతోడ
నో జనస్థాన మహీజములార యీ
విధ మెఱిగింపరే విభునితోడ
నో దండకాటవి నున్న తాపసులార
నాపాటు చెప్పరే నాథుతోడ
నేను శ్రీరాముభార్య మీ రెవ్వరైన
నడ్డపడి తాఁకి విడిపింపరయ్య, కావ
రయ్య సురలార! మునులార! యక్షులార!
యఖిలదిక్పతులార! పుణ్యాత్ములార!

ఆంధ్రమహాభాగవతము - పోతన (15 శతా.)
కావ్యాదిని ఇష్టదేవతాప్రార్థన

శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు భక్తపాలనకళాసంరంభకున్ దానవో

ద్రేక స్తంభకుఁ గేళిలోలవిలస ద్దృగ్జాలసంభూతనా
నాకంజాత భవాండకుంభకు మహానందాగనా డింభకున్.

## భారతీస్తుతి

శారదనీరదేందు ఘనసార పటీర మరాళ మల్లికా
హార తుషార ఫేన రజతాచల కాశ ఫణీశ కుంద మం
దార సుధాపయోధి సితతామర సామరవాహినీ శుభా
కారత నొప్పు నిన్ను మదిఁ గానఁగ నెన్నఁడుగల్గు భారతీ!

## దుర్గాస్తుతి

అమ్మలగన్నయమ్మ ముగురమ్మల మూలపుటమ్మ చాలఁబె
ద్దమ్మ సురారులమ్మ కడు పాఱడిపుచ్చిన యమ్మ దన్నులో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడి యమ్మ దుర్గ మా
యమ్మ, కృపాబ్ధి యిచ్చుత మహత్త్వ కవిత్వ పటుత్వ సంపదన్.

## లక్ష్మీస్తుతి

హరికిం బట్టపుదేవి, పున్నెముల ప్రో, వర్థంపుఁ బెన్నిక్క, చం
దురు తోఁబుట్టువు, భారతీగిరిసుతల్ దోనాడు పూఁబోఁడి, తా
మరలం దుండెడి ముద్దరాలు, జగముల్ మన్నించు నిల్లాలు, భా
సురతన్ లేములు వాపు తల్లి, సిరి యిచ్చున్ నిత్యకల్యాణముల్.

## కృతిపతిత్వనిర్ణయం

ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులున్
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరము వాసి కాలుచే
సమ్మెట ప్రేటులం బడక సమ్మతి శ్రీహరి కిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్.

బాలరసాలసాల నవపల్లవ కోమల కావ్యకన్యకన్
గూళల కిచ్చి యప్పడుపుఁగూడు భుజించుటకంటె సత్కవుల్

హాలికులైననేమి, గహనాంతరసీమలఁ గందమూలకౌ
ద్దాలికులైననేమి నిజదారసుతోదరపోషణార్థమై.

కాటుకకంటినీరు చనుకట్టుపయింబడ నేల యేడ్చెదో
కైటభదైత్యమర్దనుని గాదిలి కోడల! యో మదంబ! యో
హాటకగర్భురాణి! నిను నాకటికిం గొనిపోయి యల్లక
ర్ణాటకిరాటకీచకుల కమ్మ, త్రిశుద్ధిగ నమ్ము భారతీ!

'పలికించెడువాఁడు రామభద్రుండట'

పలికెడిది భాగవతమట,
పలికించెడువాఁడు రామభద్రుండట, నే
బలికిన భవహర మగునట,
పలికెద వేఱొండు గాథ పలుకఁగనేలా?

చేతులార శివుని పూజించాలి

చేతులారంగ శివుని పూజింపఁడేని
నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయుఁ సత్యంబు లోనుగాఁ దలపఁడేని
గలుగనేటికిఁ దల్లుల కడుపుచేటు.

భాగవతప్రశస్తి

లలితస్కంధము కృష్ణమూలము శుకాలాపాభిరామమ్ము మం
జులతాశోభితమున్ సువర్ణసుమనస్సుజ్ఞేయమున్ సుందరో
జ్జ్వలవృత్తమ్ము మహాఫలంబు విమలవ్యాసాలవాలంబునై
వెలయున్ భాగవతాఖ్య కల్పతరు వుర్విన్ సద్విజశ్రేయమై.

వేదకల్పవృక్ష విగళితమై శుక
ముఖసుధాద్రవమున మొనసి యున్న
భాగవతపురాణఫల రసాస్వాదన
పదవి గనుఁడు రసికభావవిదులు.

శౌనకాది మహామునులు సూతుని నడిగిన ప్రశ్న

అలసులు మందబుద్ధిబలు లల్పతరాయువు లుగ్రరోగసం
కలితులు మందభాగ్యులు సుకర్మము లెవ్వియుఁ జేయఁజాలరీ
కలియుగమందు మానవులు గావున నెయ్యది సర్వసౌఖ్యమై
యలవడు నేమిటం బొడము నాత్మకు శాంతి మునీంద్ర జెప్పవే.

భీష్మకృత కృష్ణస్తుతి

త్రిజగన్మోహన నీలకాంతిఁ దనువుద్దీపింపఁ, బ్రాభాతనీ
రజబంధు ప్రభమైన చేలముపయిన్ రంజిల్ల, నీలాలక
వ్రజసంయుక్త ముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప మా
విజయుం జేరెడు వన్నెకాఁడు మది నావేశించు నెల్లప్పుడున్.

హయరింఖాముఖ ధూళిధూసర పరిన్యస్తాలకోపేతమై
రయజాత శ్రమతోయబిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో
జయముం బార్థున కిచ్చు వేడ్కనని నాశస్త్రాహతిం జాల నొ
చ్చియుఁ బోరించు మహానుభావు మదిలోఁ జింతింతు నశ్రాంతమున్.

కుప్పించి యెగసిన కుండలంబుల కాంతి
గగనభాగంబెల్లఁ గప్పికొనఁగ
ఉరికిన నోర్వక యుదరంబులో నున్న
జగముల వ్రేగున జగతి గదలఁ
జక్రంబు చేపట్టి చనుదెంచు రయమునఁ
బైనున్న పచ్చని పటము జాఱ
నమ్మితి నాలావు నగుబాటు సేయకు
మన్నింపు మని క్రీడి మరలఁ దిగువఁ

గరికి లంఘించు సింహంబు కరణి మెఱసి
'నేడు భీష్మునిఁ జంపుదు నిన్నుఁ గాతు
విడువు మర్జున' యనుచు మద్విశిఖవృష్టిఁ
దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు.

ఒక సూర్యుండు సమస్త జీవులకుఁ దానొక్కొక్కఁడై తోచు పో
లిక నేదేవుఁడు సర్వకాలము మహాలీలఁ నిజోత్పన్న జ
న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుఁడై యొప్పుచునుండు నట్టి హరి నేఁ బ్రార్థింతు శుద్ధుండనై.

## విష్ణుభక్తి కుదిరినవాడు ఇంకేదీ కోరడు

మందార మకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁ దూగు
రాయంచ చనునే తరంగిణులకు
లలితరసాలపల్లవ ఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికాస్ఫురిత చకోరక
మరుగునే సాంద్రనీహారములకు

అంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు
వినుతగుణశీల! మాటలు వేయునేల?

## సంపూర్ణమైన శరణాగతియే కర్తవ్యము

కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి

దేవదేవుని చింతించు దినము దినము
చక్రహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి హరిఁజేరు మనియెడి తండ్రి తండ్రి.

## దైవచింతనము లేనివాడు పశువుతో సమానము

కంజాక్షునకుఁ గాని కాయంబు కాయమే
పవనగుంభిత చర్మభస్త్రిగాక
వైకుంఠుఁ బొగడని వక్త్రంబు వక్త్రమే
ఢమఢమ ధ్వనితోడి ఢక్కగాక
హరిపూజనములేని హస్తంబు హస్తమే
తరుశాఖనిర్మిత దర్విగాక
కమలేశుఁ జూడని కన్నులు కన్నులే
తనుకుడ్యజాల రంధ్రములు గాక

చక్రిచింతలేని జన్మంబు జన్మమే
తరళసలిల బుద్బుదంబు గాక
విష్ణుభక్తిలేని విబుధుండు విబుధుఁడే
పాదయుగముతోడి పశువుగాక.

## ఇంద్రియములు మనస్సును జయించినవానికి శత్రువులేదు

లోకములన్నియుఁ గడియలోన జయించినవాఁడ వింద్రియా
నీకముఁ జిత్తముం గెలువనేరవు నిన్ను విబద్ధుఁజేయు నీ
భీకరశత్రు లార్వురఁ బ్రభిన్నులఁ జేసినఁ బ్రాణికోటిలో
నీకు విరోధిలేఁడొకఁడు నేర్పున జూడుము దానవేశ్వరా!

## భగవంతుడు అంతటా ఉన్నాడు

ఇందు గలఁ డందు లేఁడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం

డెందెందు వెదకి చూచిన
నందందే గలఁడు దానవాగ్రణి! వింటే!

గజేంద్రమోక్షము – గజేంద్రుని మొర

లా వొక్కింతయులేదు, ధైర్యము విలోలంబయ్యెఁ, బ్రాణంబులున్
ఠావుల్ దప్పెను, మూర్ఛవచ్చెఁ, దనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్
నీవేతప్ప నితఃపరం బెఱుఁగ, మన్నింపందగున్ దీనునిన్
రావే యీశ్వర! కావవే వరద! సంరక్షించు భద్రాత్మకా.

ఎవ్వనిచే జనించు జగ మెవ్వని లోపల నుండు లీనమై
యెవ్వనియందు డిందుఁ బరమేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం
బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వఁడు సర్వము దానయైనవా
డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరు నే శరణంబు వేడెదన్.

అలవైకుంఠపురంబులో శ్రీహరి

అల వైకుంఠపురంబులో నగరిలో నామూలసౌధంబు దా
పల మందార వనాంతరామృతసరః ప్రాంతేందుకాంతోపలో
త్పల పర్యంక రమావినోది యగు నాపన్నప్రసన్నుండు వి
హ్వల నాగేంద్రము 'పాహి పాహి' యనఁ గుయ్యాలించి సంరంభియై.

భక్తరక్షణలో భగవంతుని సంరంభము

సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే
పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోద్ధత శ్రీకుచో
పరి చేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై.

తనవెంటన్ సిరి, లచ్చివెంట నవరోధవ్రాతమున్, దాని వె
న్కను బక్షీంద్రుఁడు, వాని పొంతను ధనుఃకౌమోదకీ శంఖచ
క్రనికాయంబును, నారదుండు, ధ్వజినీకాంతుండు రా వచ్చి రొ
య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాల గోపాలమున్.

వామనావతారకథ

ఆశాపాశము తాఁ గడుం నిడుపు, లే దంతంబు రాజేంద్ర! వా
రాశిప్రావృత మేదినీవలయ సామ్రాజ్యంబు చేకూడియుం
గాసిం బొందిరిగాక వైన్యగయ భూకాంతాదులు న్నర్థకా
మాశం బాయఁగ నేర్చిరే? మును వివాశాంతంబులం జూచిరే?

అసత్యదోషము రాని సందర్భములు

వారిజాక్షులందు వైవాహికములందు
ప్రాణవిత్తమాన భంగమందు
చకితగోకులాగ్ర జన్మరక్షణమందు
బొంకవచ్చు నఘము పొంద దధిప.

బలిచక్రవర్తి తాను ఆడినమాట తప్పననుట

కారేరాజులు, రాజ్యముల్ గలుగవే, గర్వోన్నతిం బొందరే;
వారేరీ? సిరి మూటఁగట్టుకొని పోవంజాలిరే? భూమిపైఁ
బేరైనం గలదే? శిబిప్రముఖులుం బ్రీతిన్ యశఃకాములై
యీరే కోర్కులు; వారలన్ మరచిరే యిక్కాలమున్ భార్గవా!

ఆదిన్ శ్రీసతి కొప్పుపైఁ దనువుపై నంసోత్తరీయంబుపైఁ
బాదాబ్జంబులపైఁ గపోలతటిపైఁ బాలిండ్లపై నూత్న మ
ర్యాదం జెందు కరంబు క్రిందగుట, మీఁదై నా కరం బుంట మేల్
గాదే, రాజ్యము గీజ్యమున్ సతతమే కాయంబు నాపాయమే?

వామనమూర్తి బ్రహ్మాండమునంతయు ఆక్రమించుట

ఇంతింతై వటుఁ డింతయై, మరియు దానింతై నభోవీథిపై
నంతై, తోయదమండలాగ్రమున కల్లంతై, ప్రభారాశిపై
నంతై, చంద్రుని కంతయై, ధ్రువునిపై నంతై, మహర్వాటిపై
నంతై, సత్యపదోన్నతుండగుచు బ్రహ్మాండాంత సంవర్ధియై.

రవిబింబం బుపమింపఁ బాత్రమగు ఛత్రంబై, శిరోరత్నమై
శ్రవణాలంకృతియై, గళాభరణమై, సౌవర్ణకేయూరమై
ఛవిమత్కంకణమై, కటిస్థలి నుదంచద్ఘంటయై, నూపుర
ప్రవరంబై, పదపీఠమై వటుఁడు దా బ్రహ్మాండముం నిండుచోన్.

రుక్మిణీకల్యాణం - రుక్మిణి శ్రీకృష్ణునికి పంపిన సందేశం

ఏ నీ గుణములు కర్ణేంద్రియంబుల సోఁక
దేహతాపంబులు దీఱిపోవు,
నే నీ శుభాకార మీక్షింపఁ గన్నుల
కఖిలార్థలాభంబు గలుగుచుండు,
నే నీ చరణసేవ లేప్రొద్దుఁ జేసిన
భువనోన్నతత్వంబుఁ బొందఁగలుగు,
నే నీ లసన్నామ మే ప్రొద్దు భక్తితో
దడవిన బంధసంతతులు వాయు,

నట్టి నీయందు నాచిత్త మనవరతము
నచ్చియున్నది నీయాన నానలేదు
కరుణఁ జూడుము కంసారి! ఖలవిదారి
శ్రీయుతాకార! మానినీ చిత్తచోర!

ధన్యుం లోకమనోభిరాముఁ గులవిద్యారూపతారుణ్య సౌ
జన్య శ్రీబలదాన శౌర్యకరుణా సంశోభితుం విన్న నే
కన్యల్ గోరరు? కోరదే మున్ను రమాకాంతాలలామంబు రా
జన్యానేకపసింహ! నావలననే జన్మించెనే మోహముల్.

శ్రీకృష్ణుని బాల్యలీలలు - యశోద బాలకృష్ణుని ముఖమున బ్రహ్మాండమును మాచి వెరగుపడుట

కలయో, వైష్ణవమాయయో, యితరసంకల్పార్థమో, సత్యమో,
తలపం నేరకయున్నదాననొ, యశోదాదేవిఁ గానో, పర

స్థలమో, బాలకుఁ డెంత యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమైయుండుట కేమిహేతువొ, మహాశ్చర్యంబు చింతింపఁగన్.

కనుమరుగైన కృష్ణుని గోపికలు కాళిందీవనాంతరములలో వెదకుట

నల్లనివాఁడు, పద్మనయనంబులవాఁడు, కృపారసంబు పైఁ
జల్లెడివాఁడు, మౌళిపరిసర్పితపింఛమువాఁడు, నవ్వురా
జిల్లెడి మోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబుఁ దెచ్చె నో
మల్లియలార! మీపొదలమాటున లేఁడుగదమ్మ, చెప్పరే.

అంగజునైనఁ జూడ హృదయంగముఁడై కరగించువాఁడు శ్రీ
రంగదురంబువాఁడు మధురంబగు వేణురవంబువాఁడు మ
మ్మంగజు పువ్వుఁదూపులకు నగ్గముసేసి లవంగలుంగనా
రంగములార! మీకడకు రాఁడుగదా? కృప నన్నుఁ జూడరే.

చాణూరుడు మల్లయుద్ధ సందర్భమున శ్రీకృష్ణునితో అన్నమాటలు

మహిమతో నుండంగ మధురాపురముగాని
వొలుపారు వైకుంఠపురము గాదు,
గర్వంబుతో నుండఁ గంసునిసభగాని
సంసారరహితుల సభయు గాదు,
ప్రకటించి వినఁగ నాబాహునాదముగాని
నారదు వీణాస్వనంబు గాదు,
చదురులాడఁగ మల్లజనవిగ్రహముగాని
రమతోడి ప్రణయవిగ్రహముగాదు,

వెలసి తిరుగంగ వేదాంతవీథి గాదు
మొఱఁగిపో మునిమనముల మూలగాదు
సాగినడువంగ భక్తులజాడ గాదు
శౌరి! నాముంగల నీ వెందుజనియె దింక.

ఒక సూర్యుండు సమస్త జీవులకుఁ దానొక్కొక్కఁడై తోచు పో
లిక నేదేవుఁడు సర్వకాలము మహాలీలఁ నిజోత్పన్న జ
న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూన రూ
పకుఁడై యొప్పుచునుండు నట్టి హరి నేఁ బ్రార్థింతు శుద్ధుండనై.

విష్ణుభక్తి కుదిరినవాడు ఇంకేదీ కోరడు

మందార మకరంద మాధుర్యమునఁ దేలు
మధుపంబు వోవునే మదనములకు
నిర్మల మందాకినీ వీచికలఁ దూగు
రాయంచ చనునే తరంగిణులకు
లలితరసాలపల్లవ ఖాదియై చొక్కు
కోయిల సేరునే కుటజములకుఁ
బూర్ణేందు చంద్రికాస్ఫురిత చకోరక
మరుగునే సాంద్రనీహారములకు

అంబుజోదర దివ్యపాదారవింద
చింతనామృతపాన విశేషమత్త
చిత్త మేరీతి నితరంబుఁ జేరనేర్చు
వినుతగుణశీల! మాటలు వేయునేల?

సంపూర్ణమైన శరణాగతియే కర్తవ్యము

కమలాక్షు నర్చించు కరములు కరములు
శ్రీనాథు వర్ణించు జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁ జూచు చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు శిరము శిరము
విష్ణు నాకర్ణించు వీనులు వీనులు
మధువైరిఁ దవిలిన మనము మనము
భగవంతు వలగొను పదములు పదములు
పురుషోత్తముని మీది బుద్ధి బుద్ధి

స్థలమో, బాలకుఁ డెంత యీతని ముఖస్థంబై యజాండంబు ప్ర
జ్వలమైయుండుట కేమిహేతువొ, మహైశ్వర్యంబు చింతింపఁగన్.

కనుమరుగైన కృష్ణుని గోపికలు కాళిందీవనాంతరములలో వెదకుట

నల్లనివాఁడు, పద్మనయనంబులవాఁడు, కృపారసంబు పైఁ
జల్లెడివాఁడు, మౌళిపరిసర్పితపింఛమువాఁడు, నవ్వురా
జిల్లెడి మోమువాఁ డొకఁడు చెల్వల మానధనంబుఁ దెచ్చె నో
మల్లియలార! మీపొదలమాటున లేఁడుగదమ్మ, చెప్పరే.

అంగజునైనఁ జూడ హృదయంగముఁడై కరగించువాఁడు శ్రీ
రంగదురంబువాఁడు మధురంబగు వేణురవంబువాఁడు మ
మ్మంగజు పువ్వుఁదూపులకు నగ్గముసేసి లవంగలుంగనా
రంగములార! మీకడకు రాఁడుగదా? కృప నన్నుఁ జూడరే.

చాణూరుడు మల్లయుద్ధ సందర్భమున శ్రీకృష్ణునితో అన్నమాటలు

మహిమతో నుండంగ మధురాపురముగాని
వైకుంఠపురము గాదు,
గర్వంబుతో నుండఁ గంసునిసభగాని
సంసారరహితుల సభయు గాదు,
ప్రకటించి వినఁగ వాబాహునాదముగాని
నారదు వీణాస్వనంబు గాదు,
చదురులాడఁగ మల్లజనవిగ్రహముగాని
రమతోడి ప్రణయవిగ్రహముగాదు,

వెలసి తిరుగంగ వేదాంతవీథి గాదు
మొఱఁగిపో మునిమనముల మూలగాదు
సాగినడువంగ భక్తులజాడ గాదు
శౌరి! నాముందల నీ వెందుజనియె దింక.

ఏభావంతో హరిని ధ్యానించినా సద్గతిని పొందవచ్చును

కామోత్కంఠత గోపికల్, భయమునం గంసుండు, వైరిక్రియా
సామగ్రిన్ శిశుపాలముఖ్యనృపతుల్, సంబంధులై వృష్ణులున్
ప్రేమన్ మీరలు, భక్తి మేము నిదె చక్రిం గంటి మెట్లైన ను
ద్దామ ధ్యానగరిష్ఠుఁడైన హరిఁ జెందన్వచ్చు ధాత్రీశ్వరా!

శృంగార నైషధం – శ్రీనాథుడు (14 – 15 శతా.)
శ్రీనాథుని వైదుష్యము

బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడ వుదుప్రజ్ఞావిశేషోదయా
జిహ్మస్వాంతుఁడ వీశ్వరార్చన కళాశీలుండ వభ్యర్హిత
బ్రహ్మాండాది మహాపురాణచయ తాత్పర్యార్థ నిర్ధారిత
బ్రహ్మజ్ఞాన కళానిధానమవు, నీ భాగ్యంబు సామాన్యమే.

'నైషధమ్ విద్వదౌషధమ్'

పనివడి నారికేళఫలపాకమునం జవియైన భట్టహ
ర్షుని కవితామగుంభములు సోమరిపోతులు కొంద అయ్యలో
వని కొనియాడనేర, రది యట్టిద, లేజవరాలు చెక్కు గీ
టిన వసవల్చు బాలకుఁడు డెందమునం గలగంగ నేర్చునే.

శ్రీనాథుని అనువాద విధానము

మృదురీతిం బ్రతివాసరంబు గమికర్మీభూత నానానదీ
నద కాంతారపురీశిలోచ్చయుఁడనై నైకాద్భుత శ్రీజిత
త్రిదివంబైన విదర్భదేశమున నారీరత్నముం గాంచితిన్
సదసత్సంశయ గోచరోదరి శరత్సంపూర్ణ చంద్రాననన్.

కమలేందీవరషండమండిత లసత్కాసార సేవారతిన్
గమికర్మీకృత నైకనీ వృతుఁడనై కంటిన్ విదర్భంబునన్
రమణిం బల్లవపాణిఁ బద్మనయనన్ రాకేందుబింబాననన్.
సమపీనస్తని నాస్తినాస్తి విచికిత్సాహేతు శాతోదరిన్.

భీమేశ్వరపురాణము – కుకవిదూషణ

బోధ మల్పంబు గర్వ మభ్యున్నతంబు
శాంతి నిప్పచ్చరంబు మచ్చరము ఘనము
కూపమండూకములఁబోలె గొంచె మెఱిఁగి
పండితమ్మన్యులైన వైతండికులకు.

వికటముననుండి శ్రుతిపుట విష్ఠురముగ
నదరి కాకులు తాము బిట్టఱచినప్పు
డుదధి రాయంచ యూరకయుంట లెస్స
సైఁపరాకున్న నెందేనిఁ జనుట యొప్పు.

కాశీఖండము – శ్రీనాథుని రచనలు

చిన్నారిపొన్నారి చిఱుతకూఁకటినాఁడు
రచియించితి మరుత్తరాట్చరిత్ర,
నూనూఁగుమీసాల నూత్నయౌవనమున
శాలివాహన సప్తశతి నొడివితి,
సంతరించితి నిండుజవ్వనంబునయందు
హర్షనైషధకావ్య మాంధ్రభాషఁ,
బ్రౌఢనిర్భరవయః పరిపాకమునఁ గొని
యాడితి భీమనాయకుని మహిమఁ,

బ్రాయమింతకు మిగులఁ గైవ్రాలకుండఁ
గాశికాఖండమను మహాగ్రంథ మేను
దెనుఁగుఁజేసెదఁ గర్ణాటదేశకటక
పద్మవనహేళి శ్రీనాథభట్టసుకవి.

కవిసార్వభౌముడు

ఈ క్షోణిన్ నినుఁబోలు సత్కవులు వే రీ నేటికాలంబునన్
దాక్షారామ చళుక్యభీమవర గంధర్వాప్సరోభామినీ

వక్షోజద్వయ గంధసారఘుసృణ ద్వైరాజ్యభారంబు న
ధ్యక్షించుం గవిసార్వభౌమ! భవదీయ ప్రౌఢసాహిత్యముల్.

ఏడుపు పద్యం

కొసరి వసంతకాలమునఁ గోయిన క్రౌంచినభంగి నేడ్చె వ
బ్జసరుహనేత్ర కొండచటిఁ బెద్దయెలుంగున వెక్కివెక్కి వె
క్కసమగు మన్యువేగమునఁ గాటుకకన్నుల నీరు సోనలై
యుసిరికకాయ లంతలు పయోధరము ల్దిగువాఱునట్లుగాఁ.

శ్రీనాథుని చాటుపద్యాలు
పల్నాటి సీటిఎద్దడి – శివునితో పరిహాసం

సిరిగలవానికి చెల్లును
తరుణుల పదియారువేల తగపెండ్లాడఁ
తిరిపెమున కిద్ద రాండ్రా?
పరమేశా! గంగవిడువు, పార్వతి చాలుఁ.

జంగమస్త్రీపై చెప్పిన పద్యం

తొలకరిమించుతీగగతి తోప దుకాణముమీద నున్న యా
యలికులవేణితో తములపాకుల బేరము లాడబోయి నే
వలచుటకేమి? శంకరునివంటి మహాత్ముడె లింగరూపుడై
కలికిమిటారి గుబ్బచనుగట్టుల సందుల నాట్యమాడగఁ.

శ్రీనాథుడు సాంపరాయని కుమారుడైన తెలుగురాయని కస్తూరి యాచించుట

అక్షయ్యంబగు సాంపరాయని తెలుంగాధీశ! కస్తూరికా
భిక్షాదానము సేయరా సుకవిరాడ్ బృందారక శ్రేణికిఁ
దాక్షారామ చళుక్యభీమవర గంధర్వాప్సరోభామినీ
వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్.

క్రీడాభిరామం

జనని సంస్కృతంబు సకలభాషలకును
దేశభాషలందుఁ దెనుగులెస్స
జగతిఁ దల్లికంటె సౌభాగ్యసంపద
మెచ్చుటాడుబిడ్డ మేలుగాదె.

సింగభూపాలుని ఆస్థానమునకు పోవునప్పుడు చేసిన శారదాస్తుతి

దీనారటంకాల దీర్థమాడించితి
దక్షిణాధీశు ముత్యాలశాల,
పలుకుతోడై తాంధ్రభాషా మహాకావ్య
నైషధగ్రంధ సందర్భమునకు,
పగులగొట్టించి తుద్భట వివాదప్రౌఢి
గౌడడిండిమభట్టు కంచుఢక్క,
చంద్రభూష క్రియాశక్తి రాయలయొద్ద
పాదుకొల్పితి సార్వభౌమ బిరుద,

మెటుల మెప్పించెదో నన్ను నింకమీద
రావుసింగ మహీపాలు ధీవిశాలు
నిండుకొలువున నెలకొనియుండి నీవు
సకలసద్గుణ నికురంబ! శారదాంబ!

'కర్ణాటక్షితిపాలమౌక్తిక సభాగారాంతరాకల్పిత స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ కవిరాట్' శ్రీనాథునికి వార్ధకదశలో కలిగిన కష్టాలు

కవిరాజుకంఠంబు కౌగలించెనుగదా
పురవీధి నెదురెండ బొగడదండ,
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా
నగరివాకిటనుండు నల్లగుండు

ఆంధ్రనైషధకర్త యంఘ్రి యుగ్మంబునఁ
దగిలియుండెనుగదా నిగళయుగము,
వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేత
వియ్యమందెనుగదా వెదురుగొడియ,

కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయె తిలలుపెసలు
బొడ్డుపల్లెను గొడ్డేలి మోసపోతి
నెట్లుచెల్లింతు టంకంబు లేదునూర్లు.

అవసానదశలో చెప్పిన పద్యం
చివరిపంక్తులలో కవి ఆత్మప్రత్యయం ఎట్టిదో తెలుస్తుంది

కాశికావిశ్వేశుఁ గలసె వీరారెడ్డి
రత్నాంబరంబు లే రాయఁ డిచ్చు,
కైలాసగిరిఁబండె మైలారువిభుఁ డేగె
దినవెచ్చ మేరాజు దీర్పగలఁడు,
రంభఁ గూడె తెనుంగురాయరాహుత్తుండు
కస్తూరి కేరాజు ప్రస్తుతింతు,
స్వర్గస్థుఁడయ్యె విస్సన్నమంత్రి మరి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తి గలదు,

భాస్కరుఁడు మున్నె దేవునిపాలి కరిగె
కలియుగంబున నిక నుండ కష్టమనుచు
దివిజకవివరుగుండియల్ దిగ్గురనగ
నరుగుచున్నాఁడు శ్రీనాథు డమరపురికి.

ఆముక్తమాల్యద — కృష్ణదేవరాయలు (16 శతా.)
కావ్యాదిని శ్రీవేంకటేశ్వర స్తుతి

శ్రీకమనీయహారమణిఁ జెన్నుగఁ దానును, గౌస్తుభంబునం
దా కమలాంధూటియు నుదారతఁ దోపఁ, బరస్పరాత్మలం

దాకలితంబులైన తమ యాకృతు లచ్యుతఁ బైకిఁ దోఁచి, య
స్తోకతనందుఁ దోఁచెనన, శోభిలు వేంకటభర్తఁ గొల్చెదన్.

## కావ్యేతివృత్తము

ఎన్నిన గూర్తు నన్న, విను, మే మునుదాల్చిన మాల్యమిచ్చు న
ప్పిన్నది రంగమందయిన పెండిలిసెప్పుము, మున్ను గొంటి నే
వ న్ననదండ యొక మగవాఁ డిడ, నేను దెలుంగురాయఁడ,
గ్గన్నడరాయ! యక్కొదువ గప్పు ప్రియాపరిభుక్త భాక్కథల్.

## దేశభాషలందుఁ దెలుగు లెస్స'

తెలుఁ గదేల యన్న దేశంబు దెలుఁ, గేను
దెలుఁగు వల్లభుండఁ, దెలుఁగొ కండ,
యెల్ల నృపులు గొలువ నెఱుఁగవే బాసాడి,
దేశభాషలందుఁ దెలుఁగు లెస్స.

## విష్ణుచిత్తుని యింట నిరంతరాన్నదానము

ఆనిష్ఠానిధిగేహసీమ నడురేయాలించిన న్మ్రోయు నెం
తే నాగేంద్రశయాను పుణ్యకథలుం దివ్యప్రబంధానుసం
ధానధ్యానము 'నాస్తిశాకబహుతా నాస్త్యుష్ణతా నాస్త్యపూ
పో నాస్త్యోదన సౌష్ఠవంచ కృపయా భోక్తవ్య' మన్మాటలున్.

## నివృత్తిమార్గము

ఎక్కడి రాజ్యవైభవము లెక్కడి భోగము లేటి సంభ్రమం,
బక్కట! బుద్బుదప్రతిమమైన శరీరము నమ్మి మోక్షపుం
జిక్కి గణింపకుంటి, యుగసంధుల నిల్చియుఁ గాలుచేతి బల్
త్రొక్కుల నమ్మను ప్రభృతులున్ దుద రూపఱుకుండ నేర్చిరే.

మనుచరిత్రము - అల్లసాని పెద్దన (16 శతా.)

హిమాలయ పర్వత వర్ణన

అటఁ జని కాంచె భూమిసురుఁ డంబరచుంబి శిరస్సరజ్ఝరీ
పటల ముహుర్ముహు ర్లుఠదభంగ తరంగ మృదంగ నిస్వన
స్ఫుట నటనానుకూల పరిపుల్ల కలాపకలాపి జాలమున్
కటక చరత్కరేణు కరకంపితసాలము శీతశైలమున్.

ప్రవరుడు వరూధినిని చూచుట

అతఁ డావాతపరంపరా పరిమళ వ్యాపారలీలన్ జనా
న్వితమిచ్చోటవి చేరఁబోయి కనియెన్ విద్యుల్లతావిగ్రహన్
శతపత్రేక్షణఁ జంచరీక చికురన్, జంద్రాస్యఁ జక్రస్తనిన్
నతనాభిన్, నవలా, నొకానొక మరున్నారీ శిరోరత్నమున్.

ప్రవరుడు వరూధినిని పలుకరించుట

ఎవ్వతె వీవు భీతహరిణేక్షణ! యొంటి జరించె దోటలే
కివ్వనభూమి, భూసురుఁడ, నేఁ బ్రవరాఖ్యుఁడఁ ద్రోవ తప్పితిన్
గ్రొవ్వున నిన్నగాగ్రమునకుం జనుదెంచి. పురంబుఁ జేర నిం
కెవ్విధిఁ గాంతుఁ, దెల్పఁగదవే తెరువెద్ది, శుభంబు నీ కగున్.

వరూధిని సమాధానము

ఇంతలు కన్నులుండఁ దెరు వెవ్వరి వేఁడెదు భూసురేంద్ర! యే
కాంతమునందునున్న జవరాండ్ర నెపంబిడి పల్కరించులా
గింతియకాక, నీ వెఱుఁగవే మునువచ్చిన త్రోవచొప్పు ? నీ
కింత భయంబులే కడుగ నెల్లిదమైతిమి మాటలేటికిన్.

వరూధిని వలపు

ఎన్నిభవంబులన్ గలుగు నిక్షుశరాసన సాయకవ్యథా
ఖిన్నత వాడి వత్తలయి కేలఁ గపోలము లూఁది చూపులన్

విన్నఁదనంబు దోఁప గనువేఁదఱునన్ బయిగాలి సోకినన్
వెన్నవలెన్ గరంగు నలివేణులఁ గౌఁగిటఁజేర్చు భాగ్యముల్.

## ప్రవరుని తిరస్కారము

ప్రాంచద్భూషణ బాహుమూలరుచితోఁ బాలిండ్లు పొంగారఁబై
యంచుల్ మోవఁగఁ గౌగలించి యధరం బాసింప హా! శ్రీహరీ!
యంచున్ బ్రాహ్మణుఁ డోరమోమిడి తదీయాంసద్వయం బంటి పొ
మ్మంచున్ ద్రోచెఁ, గలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్.

## ఏడుపుపద్యం

పాటున కింతులోర్తురె కృపారహితాత్మక! నీవు త్రోవ ని
చ్చోట భవన్నఖాంకురము సోఁకె గనుంగొను మంచుఁ జూపి య
ప్పాటలగంధి వేదన నెపంబిడి యేడ్చెఁ గలస్వనంబుతో
మీటిన విచ్చు గుబ్బచనుమిట్టల నశ్రులు చిందువందగన్.

## సూర్యాస్తమయ వర్ణన

తరుణి ననన్యకాంత నతిదారుణ పుష్పశిలీముఖ వ్యథా
భరవివశాంగి నంగభవుబారికి నగ్గముసేసి క్రూరుఁడై
యరిగె మహీసురాధముఁ డహంకృతితో నని రోషభీషణ
స్ఫురణ వహించెనో యన నభోమణి దాల్చెఁ గషాయదీధితిన్.

## 'మగవారి కృత్యముల్'

ననుఁజికురాకు మేయుతఱి నోరికెలంకులఁ దేఁటి గుట్టినన్
వనతరుశాఖలం గువకువధ్వనిఁ బాఱు పికాంగనం బికం
బనునయమొప్ప మాన్పుగతి నాత్మముఖంబు ముఖంబు జేర్చి చుం
బన మొనరించె. నందుసుడిమాయలుగా మగవారి కృత్యముల్.

పెద్దన చాటుపద్యాలు

రాయలు ఒకప్పుడు కృతి చెప్పమని వేడగా పెద్దన చెప్పిన చాటువు

నిరుపహతిస్థలంబు, రమణీప్రియదూతిక తెచ్చియిచ్చు క
ప్పురవిడె, మాత్మ కింపయిన భోజన, ముయ్యెలమంచ. మొప్పు త
ప్పరయు రసజ్ఞు లూహ తెలియంగల లేఖక పాఠకోత్తముల్
దొరికినగాక, యూరక కృతుల్ రచియింపు మటన్న శక్యమే.

సమస్యాపూరణము

'కలనాఁటి ధనము లక్కఁడి
గలనాటికి దాఁచఁ గమలగర్భుని వశమా?'
నెలనడిమినాఁటి వెన్నెల
యలవడునే గాదెఁబోయ నమవసనిసికిన్.

కృష్ణరాయల నిర్యాణమునకు దుఃఖితుడై చెప్పిన పద్యము

ఎదురైనచో దనమదకరీంద్రము నిల్పి
కేలూత యొసగి యెక్కించుకొనియె
మనుచరిత్రం బందుకొను వేళ
బురమేగ బల్లకి తనకేల బట్టియెత్తె
గోకట గ్రామాద్యనేకాగ్ర హారంబు
లడిగిన సీమలయందు నిచ్చె
బిరుదైన కవిగండెపెండేరమున కీవ తగుదని
తానె పాదమున దొడగె

'ఆంధ్రకవితాపితామహా, అల్లసాని
పెద్దన కవీంద్ర' యని నన్ను పిల్చునట్టి
కృష్ణరాయలతో దివికేగలేక
బ్రతికియున్నాఁడ జీవచ్ఛవంబ నగుచు.

పారిజాతాపహరణము - నందితిమ్మన (16 శతా.)
శ్రీకృష్ణుడు సత్యభామను అనునయించుట

పాటలగంధి చిత్తమునఁ బాటిలు కోపభరంబుఁ దీర్పనె
ప్పాటను బాటుగామి, మృదుపల్లవకోమల తత్పదద్వయీ
పాటలకాంతి మౌళిమణిపంక్తికి వన్నియవెట్ట నా జగ
న్నాటకసూత్రధారి యదునందనుఁ డర్మిలి మ్రొక్కె మ్రొక్కినన్.

జలజాతాసనవాసవాది సురపూజాభాజనంబై తన
ర్చు లతాంతాయుధు కన్నతండ్రి శిర మచ్చో వామపాదంబునన్
దొలఁగం ద్రోచె లతాంగి, యట్లయగు నాథుల్ నేరము ల్సేయఁ బే
రలుకం జెందినయట్టి కాంత లుచితవ్యాపారముల్ నేర్తురే.

ఏడుపుపద్యం

ఈసునఁబుట్టి డెందమున హెచ్చిన శోకదవానలంబుచే
గాసిలి యేడ్చెఁ బ్రాణవిభుకట్టెదుటన్ లలితాంగి పంకజ
శ్రీసఖమైన మోముపయిఁ జేలచెఱంగిడి బాలపల్లవ
గ్రాసకషాయకంఠ కలకంఠ వధూకల కాకలీధ్వనిన్.

శ్రీకాళహస్తీశ్వర శతకము - ధూర్జటి (16 శతా.)
ఆత్మనివేదనము

కాయల్గాచె వధూనఖాగ్రములచేఁ గాయంబు వక్షోజముల్
రాయన్ రాపడె ఱొమ్ము, మన్మథవిహారక్లేశ విభ్రాంతిచేఁ
బ్రాయం బాయెను, బట్టఁగట్టెఁ దల, చెప్పన్ రోత, సంసార మే
జేయంజాల విరక్తుఁ జేయఁగదవే శ్రీకాళహస్తీశ్వరా!

రాజుల్ మత్తులు, వారి సేవ నరకప్రాయంబు, వా రిచ్చు నం
భోజాక్షీ చతురంతయాన తురగీ భూషాదు లాత్మవ్యథా
బీజంబుల్, తదపేక్ష చాలుఁ, బరితృప్తిం బొందితిన్, జ్ఞానల
క్ష్మీ జాగ్రత్పరిణామ మిమ్ము దయతో శ్రీకాళహస్తీశ్వరా!

ఏ వేదంబు పఠించె లూత, భుజగం బే శాస్త్రముల్ చూచె, తా
నే విద్యాభ్యసనం బొనర్చె కరి, చెం చే మంత్ర మూహించె, బో
ధావిర్భావనిదానముల్ చదువు లయ్యా కావు, మీపాద సం
సేవాసక్తియెకాక జంతుతతికిన్, శ్రీకాళహస్తీశ్వరా!

పరిశీలించితి మంత్రతంత్రములు, చెప్ప న్వింటి సాంఖ్యాది యో
గరహస్యంబుల్, బహువేదశాస్త్రములు వక్కాణించితిన్ శంకవో
దరయన్ గుమ్మడికాయలోని నవగింజంతైన నమ్మించి సు
స్థిరవిజ్ఞానము త్రోవఁ జెప్పగదవే శ్రీకాళహస్తీశ్వరా!

### తెనాలిరామకృష్ణుని చాటువులు

దగ్గర చేరినా అవ్వాలి మొగమైయున్న భోగినితో అన్న మాటలు

వరబింబాధరముల్ పయోధరముల్ వక్రాలకంబుల్ మనో
హర లోలాక్షులు జూప కవ్వలి మొగంబైనంత నేమాయె నీ
గురుభాస్వజ్జఘనంబు గ్రొమ్ముడియు మాకుం జాలవే గంగ క
ద్దరి మే లిద్దరి కీడునుం గలదె? ఉద్యద్రాజ బింబాననా!

### కృష్ణరాయలు ఇచ్చిన సమస్య-పూరించుట

'స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటి పల్కుల కేల గల్గెనో
యతులిత మాధురీమహిమ?' హా! తెలిసెన్ భువనైకమోహనో
ద్ధత సుకుమార వారవనితాజనతా ఘనతాపహారి సం
తత మధురాధరోదిత సుధారసధారలు గ్రోలుటంజుమీ.

### ఒక భట్టుకవి ఇచ్చిన సమస్యను పూరించిన విధము

గంజాయి త్రాగి తురకల
సంజాతుల గూడి కల్లు చవిగొన్నావా?
లంజలకొడకా యెక్కడ
'కుంజర యూధంబు దోమకుత్తుకఁ జొచ్చెన్'.

అదే కృష్ణరాయలు తానిచ్చినట్లు భావించి
పూరించమని అడుగగా చెప్పినవిధము

రంజనచెడి పాండవు లరి
భంజనులై విరటుగొల్వఁ బాల్పడి రకటా
సంజయ! యేమని చెప్పుము
'కుంజరయూథంబు దోమకుత్తుక జొచ్చెన్'.

వసుచరిత్ర - రామరాజభూషణుడు (16 శతా.)
ఆంధ్రవాఙ్మయప్రపంచము

మహి మున్వాగనుశాసనుండు సృజియింపం గుండలీంద్రుండు త
న్మహనీయస్థితి మూలమై నిలువ శ్రీనాథుండు ప్రోవ న్మహా
మహులై సోముఁడు భాస్కరుండు వెలయింపన్ సొంపువాటించు నీ
బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమునఁ దత్ప్రాగల్భ్య మూహించెదన్.

పద్యచమత్కృతి

స్వైరవిహార ధీరలగు సారసలోచన లున్నచోటికిన్
భోరున లాతివారు చొరఁబూనినచో రసభంగ మంచు నేఁ
జేరక పువ్వుఁ దీవియల చెంతనె నిల్చి లతాంగి రూపు క
న్నారఁగఁ జూచి వచ్చితి నవాంబురుహాంబక నీకు దెల్పఁగన్.

గిరిక నాసికావర్ణనము

నానాసూన వితానవాసనల నానందించు సారంగ మే
లా నన్నొల్లదటంచు గంధఫలి బల్కాకం దపంబంది యో
షానాసాకృతిఁ జూచి సర్వసుమన స్సౌరభ్య సంవాసమై
పూనెం బ్రేక్షణ మాలికా మధుకరీ పుంజంబు నిర్వంకలన్.

విడుపుపద్యం

ఆ జాబిల్లి వెలుంగు వెల్లికల డాయన్లేక రాకానిశా
రాజశ్రీ సఖమైన మోమునఁ బటాగ్రం బొత్తి యెల్గెత్తియా

రాజీవానన యేడ్చెఁ గిన్నరవధూరాజత్కరాంభోజకాం
భోజీమేళ విపంచికారవ సుధాపూరంబు తోరంబుగన్.

కవికర్ణరసాయనము – సంకుసాల నృసింహకవి (16 శతా.)
కవి కవితాసామర్థ్యము

యతి విటుఁడు గాకపోవునె ట్లస్మదీయ
కావ్యశృంగార వర్ణనాకర్ణనమున
విటుఁడు యతి గాక పోరాదు వెస మదీయ
కావ్య వైరాగ్య వర్ణనాకర్ణనమున.

కృష్ణరాయల కూతురు మోహనాంగి ఈ పద్యమును
నృసింహకవినుండి ధనమునిచ్చి కొనినట్లు ఐతిహ్యము

ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తి జూచి
తరుణి తనుమధ్య మెచటికో తలగిపోయె
నుండెనేనియుఁ గనఁబడకున్నె యహహ!
యుద్ధతులమధ్య బేదల కుండఁ దరమె?

కళాపూర్ణోదయము – పింగళి సూరన (16 శతా.)
కలభాషిణి, చెలికత్తెల ఉయ్యాలాటలు

తమిఁ బూఁదీఁగెల తూఁగుటుయ్యెలలఁ బంతాలాడుచున్ దూగు నా
కొమరుం బ్రాయపు గబ్బిగుబ్బెతల యంఘ్రుల్ చక్కఁగాఁ జాగి మిం
టి మొగంబై చనుదెంచురీవిఁ గనుఁగొంటే దివ్యమౌనీంద్ర! నా
కమ్మగినేత్రలమీఁదఁ గయ్యమునకుం గాల్దాచులా గొప్పెడిన్.

విజయవిలాసము – చేమకూర వేంకటకవి (17 శతా.)
సుభద్ర యౌవన ప్రాదుర్భావము

అతివ కుచంబులున్ మెఱుగుటారును వేనలియున్ ధరాధిపో
న్నతియు నహీనభూతికలనంబు ఘనాభ్యుదయంబు నిప్పుడొం

దితిమని మాటిమాటికి నిక్కెడు నీల్గెడు విఱ్ఱవీఁగెడుఁ
క్షితి నటుగాదె యొక్కరికి న్నడుమంత్రపు గల్మి కల్గినన్.

సుభద్ర కటాక్షముల అందము

చిత్తజుఁడల్గి తూపుమొనచేసినఁ జేయగనిమ్ము, పైధ్వజం
బెత్తిన నెత్తనిమ్ము, వచియించెదఁ గల్గినమాట గట్టిగా
నత్తరళాయతేక్షణ కటాక్ష విలాసరస ప్రవాహముల్
కుత్తుకబంటి తామరలకున్ దలమున్కలు గండుమీలకున్.

చంద్రోపాలంభనము

శివుఁ డిటు రమ్మటంచు దయచేసినచోఁ దలకెక్కి, తుగ్రపై
భవమునఁ జూచుచో నడుగుబట్టితి, వేమనవచ్చు నీగుణం
బవునవు, నందినన్ సిగయు, నందకయున్నను గాళ్లుఁ బట్టుకుం
దువు హరిణాంక! వేలకొలదుల్గద నీవడకల్ తలంపఁగన్.

పంచతంత్రము – భైచరాజు వేంకటకవి (17 శతా.)
కవిత్వ మిట్లుండవలెను

ఘనతరఘూర్జరీ కుచయుగక్రియ గూఢముగాక ద్రావిడీ
స్తనగతిఁ దేటగాక యరచాటగు నాంధ్రవధూటి చొక్కపుం
జనుఁగవఁ బోలి గూఢమును జాటుదనంబును గాక యుండఁజె
ప్పిన యదివో కవిత్వ మనిపించు, నగిం చటుగాక యుండినన్.

సుమతిశతకము – బద్దెన (13 శతా ?)

శ్రీరాముని దయచేతను
నారూఢిగ సకలజనులు నౌరాయనగా
ధారాళమైననీతులు
నోరూరగ చవులుబుట్ట నుడివెద సుమతీ.

అప్పిచ్చువాడు వైద్యుడు
నెప్పుడు నెడతెగక పారు నేరును ద్విజుడుఁ
జొప్పడిన యూర నుండుము
చొప్పడకున్నట్టి యూరు సొరకుము సుమతీ.

ఆకొన్నకూడె యమృతము
తా కొంకక నిచ్చువాడె దాత ధరిత్రిఁ
సోకోర్చువాడె మనుజుడు
తేకువగలవాడె వంశతిలకుడు సుమతీ.

ఉపకారికి నుపకారము
విపరీతము కాదు సేయ వివరింపంగా
నపకారికి నుపకారము
నెపమెన్నక సేయువాడె నేర్పరి సుమతీ.

ఎప్పటి కెయ్యది ప్రస్తుత
మప్పటి కా మాటలాడి అన్యుల మనముల్
నొప్పింపక తానొవ్వక
తప్పించుక తిరుగువాడు ధన్యుడు సుమతీ.

ఎప్పుడు సంపదగలిగిన
నప్పుడు బంధువులు వత్తు రది యెట్లన్నఁ
తెప్పలుగ జెరువునిండిన
కప్పలు పదివేలు జేరు గదరా సుమతీ.

కనకపు సింహాసనమున
శునకముఁ గూర్చుండఁబెట్టి శుభలగ్నమునఁ
దొనరగఁ బట్టముగట్టిన
వెనుకటిగుణ మేల మాను వినురా సుమతీ.

కమలములు నీటబాసిన
గమలాప్తుని రశ్మి సోకి కమలిన భంగిన్
దమతమ నెలవులు దప్పిన
దమమిత్రులె శత్రులౌట తథ్యము సుమతీ.

కులకాంతతోడ నెప్పుడు
గలహింపకు వట్టితప్పు ఘటియింపకుమీ
కలకంఠకంఠి కన్నీ
రొలికిన సిరి యింట నుండ నొల్లదు సుమతీ.

కూరిమిగల దినములలో
నేరము లెన్నడును గలుగనేరవు మరి యా
కూరిమి విరసం బైనను
నేరములే తోచుచుండు నిక్కము సుమతీ.

తనకోపమె తనశత్రువు
తనశాంతమె తనకురక్ష దయ చుట్టంబౌ
తనసంతోషమె స్వర్గము
తనదుఃఖమె నరకమండ్రు తథ్యము సుమతీ.

పతికడకు తన్నుగూర్చిన
సతికడకును వేల్పుకడకు సద్గురుకడకున్
సుతుకడకు రిత్తచేతుల
మతిమంతులు చనరు నీతిమార్గము సుమ్మీ.

వినదగు నెవ్వరు చెప్పిన
వినినంతనె వేగపడక వివరింపఁదగున్
గని కల్లనిజముఁ దెలిసిన
మనుజుడెపో నీతిపరుడు మహిలో సుమతీ.

వేమనపద్యాలు (17 శతా.)

అనగననగరాగ మతిశయిల్లుచునుండు
తినగతినగ వేము తియ్యనుండు
సాధనమున పనులు సమకూరు ధరలోన
విశ్వదాభిరామ వినురవేమ.

చిత్తశుద్ధికలిగి చేసిన పుణ్యంబు
కొంచమైన నదియు కొదువకాదు
విత్తనంబు మఱ్ఱి వృక్షంబునకు నెంత, విశ్వ.

ఆత్మశుద్ధిలేని యాచార మదియేల
భాండశుద్ధిలేని పాకమేల
చిత్తశుద్ధిలేని శివపూజ యేలరా, విశ్వ.

వేషభాషలెరిగి కాషాయవస్త్రాలు
కట్టగానె ముక్తి కలుగబోదు
తలలు బోడులైన తలపులు బోడులా, విశ్వ.

ఉప్పుకప్పురంబు నొక్కపోలిక నుండు
చూడచూడ రుచుల జాడ వేరు
పురుషులందు పుణ్యపురుషులు వేరయా, విశ్వ.

మేడిపండుజూడ మేలిమై యుండును
పొట్టవిచ్చిచూడ పురుగు లుండు
పిరికివాని మదిని బింక మీలాగురా, విశ్వ.

పసులవన్నె వేరు పాలెల్ల నొక్కటి
పుష్పజాతి వేరు పూజ యొకటి
దర్శనంబు లారు, దైవంబు నొక్కటి, విశ్వ.

గంగగోవుపాలు గంటెడైనను చాలు
కడవెడైననేమి ఖరముపాలు
భక్తిగలుగుకూడు పట్టెడైనమచాలు, విశ్వ.

కులములోన నొకడు గుణవంతు డుండెనా
కులము వెలయు వాని గుణముచేత
వెలయు వనములోన మలయజ మున్నట్లు, విశ్వ.

తల్లిదండ్రులమీద దయలేని పుత్రుండు
పుట్టనేమి ? వాడు గిట్టనేమి ?
పుట్టలోని చెదలు పుట్టవా గిట్టవా ? విశ్వ.

ఎంత చదువు చదివి ఎన్నియో విన్నను
హీను డవగుణంబు మానలేడు
బొగ్గు పాలగడుగ బోవునా నైల్యంబు, విశ్వ.

ఎవ్వరి గుణములు ఏమన్న మానవు
చక్కచేయరాదు కుక్కతోక
గడుసురాలు మగని గంప బెట్టమ్మురా, విశ్వ.

తప్పు లెన్నువారు తండోప తండమ్ము
లుర్విజనుల కెల్ల నుండు దప్పు
తప్పులెన్నువారు తమతప్పు లెరుగరు, విశ్వ.

తామసించి చేయదగదెట్టి కార్యంబు
వేగిరింప నదియు విషమ మగును
పచ్చికాయ దెచ్చి వడవేయ ఫలమౌనె, విశ్వ.

అనువుగానిచోట నధికుల మనరాదు
కొంచముండు టెల్ల కొదువకాదు
కొండ యద్దమందు కొంచమై యుండదా, విశ్వ.

నీళ్లలోన మొసలి నిగిడి యేనుగు బట్టు
బయట కుక్కచేత భంగపడును
స్థానబలిమికాని తనబలిమి కాదయా, విశ్వ.

చెప్పులోని రాయి చెవిలోని జోరీగ
కంటిలోని నలుసు కాలిముల్లు
ఇంటిలోని పోరు ఇంతింత గాదయా, విశ్వ.

ఇనుము విరిగెనేని ఇనుమారు ముమ్మారు
కాచి యతకవచ్చు క్రమముగాను
మనసు విరిగెనేని మరి చేర్చరాదయా, విశ్వ.

ఇహమునందు సుఖము ఇంపారకుండిన
పరమునందు నెట్లు పడయవచ్చు
మొదటలేని చేవ తుద నెట్లు కల్గురా, విశ్వ.

ఆలిమాటలు విని అన్నదమ్ముల రోసి
వేరె పోవువాడు వెఱ్ఱివాడు
కుక్కతోకబటి గోదావ రీదునా, విశ్వ.

చాకి కోక లుదికి చీకాకు పడజేసి
మైలదీసి లెస్స మడిచినట్లు
బుద్ధిజెప్పువాడు గ్రుద్దితే నేమయా, విశ్వ.

పాలసాగరమున పవ్వళించిన స్వామి
గొల్లయిండ్ల పాలు గోరనేల
ఎదుటివారిసొమ్ము ఎల్లవారికిప్రీతి, విశ్వ.

కనకమృగము భువిని కద్దులే దనక
తరుణి విడిచిపోయె దాశరధియు
తెలివిలేనివాడు దేవు డెట్లాయెరా, విశ్వ.

భక్తి యున్నచోట పరమేశ్వరుం డుండు
భక్తి లేనిచోట పాప ముండు
భక్తి కలుగువాడు పరమాత్ముడే నయా, విశ్వ.

నీతిశాస్త్రముక్తావళి – బద్దెన (13 శతా॥)
అజ్ఞాతకవి అనువాదం

ధనమును బ్రాతశ్ఛాయయు
వనితాజన యౌవనంబు వండిన యన్నం
బును, గడుమూర్ఖస్నేహం
బును, నిల నివి యల్పకాల భోగ్యము లరయన్.

భాస్కర శతకము – మారన వెంకన (17 శతా.)

క్రూరమనస్కులౌ పతుల గొల్చి వసించిన మంచివారికిన్
వారిగుణంబె పట్టి చెడువర్తన వాటిలు, మాధురీజలో
ధారలు గౌతమీముఖ మహానదు లంబుధి కూడినంతనే
క్షారము చెందవే మొదలికట్టడ లన్నియు దప్పి భాస్కరా!

భర్తృహరి సుభాషితములు – ఏనుగు లక్ష్మణకవి
(17 శతా.) అనువాదము

ఆకాశంబుననుండి శంభుని శిరం, బందుండి శీతాద్రి, సు
శ్లోకంబైన హిమాద్రినుండి భువి, భూలోకంబునందుండి యు

స్తోకాంభోధిఁ, బయోధినుండి పవనాంధోలోకముం జేరె గం
గా కూలంకష, పెక్కుభంగులు వివేకభ్రష్ట సంపాతముల్.

నీరము తప్తలోహమున నిల్చి యనామకమై నశించు, నా
నీరమె ముత్యమట్లు నళినీదళ సంస్థితమై తనర్చు, నా
నీరమె శుక్తిలోఁబడి మణిత్వముగాంచు సమంచితప్రభం,
బౌరుషవృత్తు లిట్లధమ మధ్యము నుత్తముఁ గొల్చువారికిన్.

తమకార్యంబుఁ బరిత్యజించియుఁ బరార్థప్రాపకుల్ సజ్జనుల్,
దమకార్యంబు ఘటించుచున్ బరహితార్థవ్యాసృతుల్ మధ్యముల్,
దమకై యన్యహితార్థఘాతుకజనుల్ దైత్యుల్, వృథాన్యార్థభం
గము గావించెడువార లెవ్వరొ యెఱుంగన్ శక్యమే యేరికిన్?

నీతిప్రౌఢవిహారులైన నిపుణుల్ నిందింపనీ మెచ్చనీ,
ఖ్యాతింజెందిన సంపదల్ నిలువనీ గాఢంబుగా సాగనీ,
ఘాతం బప్పుడ పొందనీ నియతిమైగానీ యుగాంతంబునన్,
నీతిశ్లాఘ్యపదంబు దప్పరుగదా నిత్యంబు ధీరోత్తముల్.

ఆంధ్రనాయక శతకము - కాసుల పురుషోత్తమకవి (18 శతా.)

అలు నిర్వాహకురాలు భూదేవియై
యఖిల భారకుఁడను నాఖ్య దెచ్చె
నిష్టసంపన్నురా లిందిర భార్యయై
కామితార్థుఁ డన్న ఘనత దెచ్చె
కమల గర్భుఁడు సృష్టికర్త తనూజుఁడై
బహు కుటుంబకుఁ డన్న బలిమి దెచ్చెఁ
గలుష విధ్వంసియౌ గంగకుమారియై
పతితపావనుఁ డన్నప్రతిభ దెచ్చె

నాంధ్రుబిడ్డలు దెచ్చు ప్రఖ్యాతి గాని
మొదటినుండియు నీవు దామోదరుఁడవె

చిత్రచిత్రప్రభావ! దాక్షిణ్యభావ!
హతవిమతజీవ! శ్రీకాకుళాంధ్రదేవ!

సింహాద్రి నారసింహాశతకము – గోగులపాటి కూర్మనాథకవి (18 శతా)
తురకలదండు సింహాచలంమీదికి రానున్న సమయమున చెప్పినది

పాలీయవచ్చిన భామిని ప్రాణంబు
లపహరించి చెలంగినట్లు కాదు,
యాగోత్సవంబున కతిమోదమునఁ బిల్వ
నపుడు మానును ద్రుంచినట్లు గాదు,
చేతగా కొక నరుచేతఁ జుట్టంబుల
నందరఁ జంపించినట్లు గాదు,
తుంగ కల్పించి యుత్తుంగవంశద్రోహ
మాచరించి చెలంగినట్లు గాదు,

పరబలం బిది, నీప్రజ్ఞ పనికిరాదు
లెమ్మికను మీనమేషముల్ లెక్కయిడక
చౌరవఁ దురకలఁ గొట్టఁగాఁ జూక్కలెదురె
వైరిహరరంహ! సింహాద్రి నారసింహ!

రామలింగేశ శతకము – అడిదము సూరకవి (18 శతా.)
నాటి అధికారుల దౌష్ట్యము

మాన్యంబు లీయ సమర్థుఁ డొక్కఁడు లేడు
మాన్యముల్ చెరుప సామంతులంద,
రెండిన యూళ్ల గోడెరిగింప డెవ్వఁడు
పండిన యూళ్లెన్న ప్రౌఢులంద,
రితఁడు పేదయటంచు నెరిగింప డెవ్వఁడు
కలవారి సరియెంచగలరు చాల,
తనయాలి చీకటితప్పెన్న డెవ్వఁడు
పెరకాంత రంకెన్న పెద్ద లంద,

రిట్టి దుష్టుల కధికార మిచ్చినట్టి
రాజు ననవలెగాక, దుర్నయుల ననగ
నేమిపని యున్నయది సత్కవీంద్రులకును
రామలింగేశ! రామచంద్ర పురనివాస!

దాశరథీ శతకము – భద్రాచల రామదాసు (17 శతా.)

చిక్కనిపాలపై మిసిమిఁజెందిన మీగడ పంచదారతో
మెక్కినభంగి నీ విమలమేచక రూపసుధారసంబు నా
మక్కువ పళ్లెరంబున సమాహితదాస్య మనేటి దోయిటన్
దక్కె నటంచు జుఱ్ఱెదను, దాశరథీ కరుణాపయోనిధీ!

ఖండనభీముఁ డార్తజనబాంధవుఁ డుజ్జ్వలబాణతూణకో
దండ కళాప్రచండ భుజతాండవకీర్తికి రామమూర్తికిన్
రెండవ సాటిదైవ మిక లేఁ డనుచున్ గడకట్టి భేరికా
డాండ డడాండ డాండ నినదంబు లజాండము నిండ మత్తవే
దండము నెక్కి చాటెదను, దాశరథీ కరుణాపయోనిధీ!

చాటుపద్యాలు
వేములవాడ భీమకవి (11 శతా ?)

బిసరుహగర్భు వ్రాతయును విష్ణుని చక్రము వజ్రి వజ్రమున్
దెసలను రాముబాణము యుధిష్ఠిరుకోపము మౌని శాపమున్
మసకవు పాముకాటును గుమారుని శక్తియు గాలదండమున్
బసుపతి కంటిమంటయును పండితవాక్యము రిత్తవోవునే.

రణతిక్కనపై చెప్పినది

ఏమి తపంబు సేసి పరమేశ్వరు నేమిట పూజ సేసిరో
రాముని తల్లియున్ బరశురాముని తల్లియు భీముతల్లియున్
కామునికన్నతల్లియును గంజదళాక్షుననుంగుదల్లియున్
శ్రీమహితప్రతాపుఁడగు సిద్ధయతిక్కన గన్నతల్లియున్.

జక్కనకవి

వాసనలేనిపువ్వు, బుధవర్గములేనిపురంబు, నిత్యవి
శ్వాసములేనిభార్య, గుణవంతుడుకాని కుమారుడుఙ్, సద
భ్యాసములేనివిద్య, పరిహాసప్రసంగములేని వాక్యముఙ్
గ్రాసములేనికొల్వు కొరగానివి పెమ్మయసింగధీమణీ!

రంగాజమ్మ (17 శతా.) తంజావూరు విజయరాఘవనాయకుని ప్రియురాలు. ఆస్థాన కవయిత్రి. తన్ను నిష్ఠురములాడిన పట్టమహిషికి చెప్పిన పద్యము

ఏవనితల్ మముం దలప నేమిపనో? తమ రాడువారుగా
రో? వలపించు నేర్పెరుగరో? తమ కౌగిటిలోన నుండగా
రావదియేమిరా, విజయరాఘవ! యం చిలుమారి బల్మిచే
దీవరక త్తైనై యిటుల తీసుకవచ్చితినా తలోదరీ!

క్షేత్రయ్య (17 శతా) రఘునాథభూపాలుని ఆస్థానంలో చెప్పినది

తము దామె వత్తు రర్థులు
క్రమమెరిగిన దాతకడకు, రమ్మన్నారా
కమలంబు లున్నచోటికి
భ్రమరంబుల? అచ్యుతేంద్ర రఘునాథనృపా!

అడిదము సూరకవి (18 శతా.) తన ప్రభువును నుతిస్తూ పెద్దాపుర సంస్థానంలో చెప్పినది

రాజు కళంకమూర్తి, రతిరాజు శరీరవిహీను, డంబికా
రాజు దిగంబరుండు, మృగరాజు గుహాంతరసీమవర్తి, వి
భ్రాజితపూసపా ట్విజయరామనృపాలుడు రాజుగాక యీ
రాజులు రాజులే పెమతరాజులుగాని ధరాతలంబునఙ్.

సూరకవి కవితలో రాజునుగూర్చిన ఏకవచన ప్రయోగమును
దివాను ఆక్షేపించినపుడు చెప్పినది

చిన్నప్పుడు, రతికేళిక
నున్నప్పుడు, కవితలోన యుద్ధములోనన్
వన్నెసుమీ 'రా' కొట్టుట
చెన్నగు నో పూసపాటి సీతారామా!

చిలకమర్తి లక్ష్మీనరసింహం (19 - 20 శతా.)

భరతఖండంబు చక్కని పాడియావు
హిందువులు లేగదూడలై యేడ్చుచుండ
తెల్లవారను గడసరి గొల్లవారు
పిదుకుచున్నారు మూతులు బిగియబెట్టి.

ఒక ప్రసిద్ధ చాటువు

కాకేమి తన్నుతిట్టెనె? కోకిల ధన
మేమి తన్నుగోకొమ్మనెనే? లోకము
పగయగు బరుసనివాకున, జుట్ట
మగు మధురవాక్యము కలిమిన్.

తిరుపతి వేంకటకవులు (19 - 20 శతా.)
ఆంధ్రకవితా సామ్రాజ్యాన్ని ఏకచ్ఛత్రంగా పాలించారు

ఏనుగు నెక్కినాము, ధరణీంద్రులు మ్రొక్కగ నిక్కినాము, స
న్మానము లందినాము, బహుమానములన్ గ్రహియించినార, మె
వ్వానిని లెక్కపెట్టక నవారణ దిగ్విజయం బొనర్చి ప్ర
జ్ఞానిధు లంచు పేరుగొనినారము, నీవలనన్ సరస్వతీ!

వీరు చేసిన సవాలు

దోసమటంచు నెఱింగియును దుందుడుకొప్పగ బెంచినార మీ
మీసము రెండుబాసలకు మేమె కవీంద్రులమంచు దెల్పగా
రోసము కల్గినన్ గవివరుల్ మముగెల్వుడు గెల్చిరేని యీ
మీసము తీసి మీపదసమీపములం దలటించి మ్రొక్కమే.

వీరి కవితాప్రాభవము

శతఘంట కవనమ్ము సల్పుసంగతి యన్న
 గరతలామల కమ్ముగాదె మాకు
అష్టావధాన కష్టావలంబన మన్న
 నంబికొండయ దండనంబు మాకు
ఆశుధారా కవిత్వాడంబరం బన్న
 నల్లేరుపై బండినడక మాకు
సత్కావ్యనిర్మాణ చాకచక్యం బన్న
 షడ్రసోపేత భోజనము మాకు

వ్యర్థమగు వాదము లొనర్చునట్టివారి
దంట మణగించు టావోశనంబు మాకు
దానరాధేయః కవిసముదాయిశాయి!
పండితవిధేయ! రామభూపాలరాయ!

వేంకటగిరి ఆస్థానంలో చెప్పినది. రాజుతో తమకు సామ్యం

పరదేశ సంపాదన రతిమీకు నరేంద్ర!
 పరదేశ సంపాదన రతి మాకు
లసదుత్తమ పదాభిలాష మీకు నరేంద్ర!
 లసదుత్తమ పదాభిలాష మాకు

సకలసత్యశ్లోకసక్తి మీకు నరేంద్ర!
సకలసత్యశ్లోకసక్తి మాకు
మనుమార్గవర్తనం బనువు మీకు నరేంద్ర!
మనుమార్గవర్తనం బనువు మాకు

మీకు రాజపదము మాకును కవిరాజ
పదము కల దికెందు కొదువలేదు
కాన సామ్యమిచ్చి మాన్పించు టొప్పదే
ముద్దుకృష్ణయాచ భూవరేణ్య!

పాండవోద్యోగము - శ్రీకృష్ణుడు నిదురమత్తు అభినయిస్తూ అర్జునాభిముఖంగా లేచి కౌగలించుకొని ప్రీతితో

ఎక్కడనుండి రాకయిట? కెల్లరుఁ సుఖులేకదా? యశో
భాక్కులు నీదునన్నలును భవ్యమనస్కులు నీదుతమ్ములుఁ
జక్కఁగ నున్నవారె? భుజశాలి వృకోదరుఁ డగ్రజాజ్ఞకుఁ
దక్కఁగ నిల్చి శాంతుగతిఁ దాను జరించునె తెల్పు మర్జునా.

ప్రక్కకుదిరిగి దుర్యోధనునిగాంచి గౌరవముతో

బావా! యెప్పుడు వచ్చితీవు? సుఖులే భ్రాత ల్పుతు ల్చుట్టముల్?
నీవాల్లభ్యముపట్టు కర్ణుఁడును మన్నీలుఁ సుఖోపేతులే?
మీవంశోన్నతిఁ గోరు భీష్ముఁడును మీమేల్గోరు ద్రోణాది భూ
దేవుల్ సేమముమై నెసంగుదురె? నీతేజంబు హెచ్చించుచుఁ.

శ్రీకృష్ణుఁడు అర్జునునితో

అలము సేయనే నని యథార్థము బల్కితిఁజుమ్మి, యిట్టి గో
పాలువి నన్నుఁ గోరితివి, ఖండనపండితు లగ్నితేజు లు
త్తాల ధనుర్ధరుల్ బహుశత ప్రమితుల్ యదుసింహు లందఱిఁ
బాలుగఁ గైకొనెఁ గురున్నపాలుఁడు బాలుఁడవైతి వక్కటా!

అర్జునుని సమాధానము

ఉన్నది పుష్టి మానవుల కో యదుభూషణ! యాలజాతికిన్
దిన్నది పుష్టి, నీ వరుగుదెంచి రథంబున నున్నఁజాలు, నే
సున్నముఁ జేసెదన్ రిపులఁ జూపఱు లద్భుతమంద, సర్వలో
కోన్నత! నాకుఁ బేరొసఁగు మూరక చూచుచునుండు మచ్యుతా!

కృష్ణరాయబారము - కృష్ణుడు దుర్యోధనునితో

చెల్లియొ చెల్లకో తమకుఁ జేసిన యెగ్గులు సైచి రందఱున్
దొల్లిగతించె, నేడు నను దూతగఁ బంపిరి సంధిసేయ, నీ
పిల్లలు పాపలుం ప్రజలు పెంపువహింపఁగఁ బొందు సేసెదో
యెల్లి రణంబు గూర్చెదవొ? యేర్పడఁ జెప్పుము కౌరవేశ్వరా!

అలుగుటయే యెఱుంగని మహామహితాత్ముఁ డజాతశత్రుఁడే
యలిగిననాడు సాగరము లన్నియు నేకము గాకపోవు, క
ర్ణులు పదివేవురైన నని నొత్తురు చత్తురు రాజరాజ! నా
పలుకులు విశ్వసింపుము, విపన్నుల లోకులఁ గావు మెల్లరన్.

జండాపై కపిరాజు, ముందు సితవాజి శ్రేణియుం గూర్చి వే
దండంబుం గొని తోలు స్యందనము మీద న్నారి సారించుచుం
గాండీవమ్ము ధరించి ఫల్గుణుఁడు మూకం జెండుచున్నప్పు డొ
క్కండు న్నీ మొఱ నాలకింపఁడు కురుక్ష్మానాథ సంధింపగన్.

రామాయణ కల్పవృక్షము -

విశ్వనాథ సత్యనారాయణ (19 - 20 శతా.)

'మరల నిదేల రామాయణం బన్నచో'

మరల నిదేల రామాయణం బన్నచో
 నీప్రపంచ మెల్ల నెల్లవేళ
తినుచున్న యన్నమే తినుచున్న దిన్నాళ్లు
 తన రుచి బ్రదుకులు తనవిగాన

చేపిన సంపారమే చేయుచున్నది
తనదైన యనుభూతి తనదిగాన
తలఁచిన రాముఁనే తలఁచెద నేనును
నాభక్తి రచనలు నావిగాన

కవిప్రతిభలోన నుండును గావ్యగతశ
తాంశములయందుఁ దొంబదియైనపాళ్లు
ప్రాగ్విపశ్చిన్మతంబున రసము వేయి
రెట్లు గొప్పది నవకథాదృతిని మించి.



# కొన్ని ప్రసిద్ధగేయాలు

## దేశభక్తి - గురజాడ అప్పారావు (19 - 20 శతా.)

దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా;
వొట్టిమాటలు కట్టిపెట్టోయి
గట్టిమేల్ తలపెట్టవోయి!

పాడిపంటలు పొంగిపొర్లే
దారిలో నువు పాటుపడవోయి;
తిండి కలిగితె కండకలదోయి
కండగలవాడేను మనిషోయి!

*　　*　　*

సొంతలాభం కొంతమానుకు
పొరుగువాడికి తోడుపడవోయి;
దేశమంటే మట్టికాదోయి
దేశమంటే మనుషులోయి!

*　　*　　*

ఆకులందున అణగిమణగీ
కవితకోకిల పలకవలెనోయి;
పలుకులను విని దేశమం దభి
మానములు మొలకెత్తవలెనోయి!

## యెంకిపాటలు - నండూరి సుబ్బారావు (19 - 20 శతా.)

### యెంకి నాయడుబావల ముగ్ధప్రణయం

యెనక జల్మంలోన
యెవరమోనంటీ,
సిగ్గొచ్చి నవ్వింది
సిలక నాయెంకి.

ముందు మనకేజల్మ
ముందోలె యంటి
తెలతెల్ల బోయింది
పిల్ల నాయెంకి.

ఎన్నాళ్లు మనకోలె
ఈ సుకము లంటి
కంట నీ రెట్టింది
జంట నాయెంకి.

## మహాప్రస్థానం - శ్రీశ్రీ (19 - 20 శతా.)

మరోప్రపంచం,
మరోప్రపంచం,
మరోప్రపంచం పిలిచింది!
పదండి ముందుకు
పదండి త్రోసుకు
పోదాం పోదాం పైపైకి!

కదం త్రొక్కుతూ,
పదం పాడుతూ,
హృదంతరాళం గర్జిస్తూ

పదండి పోదాం
వినబడలేదా
మరోప్రపంచపు జలపాతం?

## జ య భే రి

నేనుసైతం
ప్రపంచాగ్నికి
సమిధ నొక్కటి ఆహుతిచ్చాను!

నేనుసైతం
విశ్వసృష్టికి
అశ్రు వొక్కటి ధారపోశాను!

నేనుసైతం
భువనఘోషకు
వెర్రిగొంతుక విచ్చి మ్రోశాను!

* * *

నేనుసైతం
ప్రపంచాబ్జపు
తెల్లరేకై పల్లవిస్తాను!

నేనుసైతం
విశ్వవీణకు
తంత్రినై మూర్ఛనలు పోతాను!

నేనుసైతం
భువన భవనపు
బావుటానై పైకి లేస్తాను.



# ఆంధ్రవాఙ్మయ పరిచయము
# చారిత్రక సమన్వయము

## రాజు - కవి కాలము

### శాతవాహనులు క్రీస్తుపూర్వం 225 - క్రీస్తుశకం 225

ఆంధ్రశాతవాహనులు దక్షిణాపథ చక్రవర్తులై 4½ శతాబ్దాలు పాలించారు. పశ్చిమాన పైఠాణ (ప్రతిష్ఠానపురము, నేటి మహారాష్ట్రములోనిది), తూర్పున ధాన్యకటకము వీరి రాజధానులు.

మొదటి చక్రవర్తి శ్రీముఖ శాతవాహనుడు. 17 వ చక్రవర్తి హాలుడు 'గాథాసప్తశతి' సంకలనకర్త. ఇందులో హాలుడు, ఇతర కవులు, కవయిత్రులు చెప్పిన 700 రమణీయ శృంగారగాధలు (ప్రాకృతభాషాపద్యాలు) ఉన్నవి.

నష్టమైపోయిన గుణాఢ్యుని పైశాచీ బృహత్కథ కథాసరిత్సాగరానికి మూలం, ఈ కాలంలో వ్రాయబడినదని కొందరి అభిప్రాయం.

### క్రీ. శ. 225 - 621

ఈ యుగంలో పరిపాలించిన రాజవంశాలు: ఇక్ష్వాకులు 3 శతా. విజయపురి రాజధాని. పల్లవులు 3 - 5 శతా కాంచీనగరము, పల్నాడు. బృహత్ఫలాయనులు 4 శతా. పెదవేగి (ఏలూరువద్ద). శాలంకాయనులు 4 శతా. పెదవేగి. విష్ణుకుండినులు 5 - 6 శతా. అమరపురి.

### తూర్పు చాళుక్యులు క్రీ. శ. 625 - 1071 - 1118

వేంగి, బెజవాడ, రాజమహేంద్రవరము రాజధానులు. మొదటిరాజు కుబ్జవిష్ణువర్ధనుడు (624 - 641). రాజరాజనరేంద్రుడు రాజధానిని వేంగినుండి రాజమహేంద్ర

వరమునకు మార్చాడు, ఇతని ఆస్థానకవి నన్నయ. రాజరాజు కొడుకు రాజేంద్రుడు చోళుల దౌహిత్రుడు. తమిళదేశంలో చోళసామ్రాజ్యానికి చక్రవర్తి అయాడు (1070 - 1118). చాళుక్య చోళుల తెలుగు రాజ్యాన్ని సామంతులైన వెలనాటి చోళులు రాజప్రతినిధులుగ పాలించి, ఆటుతరువాత స్వతంత్రులైనారు.

## వెలనాటి చోళులు క్రీ. శ. 1118 - 1206

వీరికి చందవోలు రాజధాని.

మొదటి గొంకరాజు.

మొదటి వెలనాటి చోడుడు 1108 - 1132.

రెండవ గొంకరాజు 1132 - 1163.

ఇతని మంత్రి నండూరి గుండయకు మంచన కృతి అంకితము

వెలనాటి చోడుడు 1163 - 1180.

మల్లికార్జున పండితుడు ఇతని ఆస్థానానికి వచ్చి అచటి జైన బౌద్ధుల్ని వాదంలో గెలిచాడు

వెలనాటిచోళుల ప్రభుత్వం క్షీణించగా సామంతప్రభువు లనేకులు భిన్న ప్రాంతాలకు పాలకు లయినారు. చాగివంశం — బెజవాడ. కోటవంశం — ధరణికోట. హైహయులు — కోనదేశం, పలనాటిసీమ తెలుగుచోళులు — కొణిదెన, నెల్లూరు, పొత్తపి. వీరందరు పల్నాటియుద్ధంలో పాల్గొన్నారు. పల్నాటియుద్ధం 1176 - 1182 మధ్య పల్నాటిసీమలోని కారెంపూడిలో జరిగింది.

## నెల్లూరి చోళులు 13 వ శతాబ్దం

మధురాంతక పొత్తపిచోడవంశానికి చెందిన మనుమసిద్ధి ఆస్థానకవి తిక్కన.

కవిగిరిసీమ పరిపాలించిన కాటమరాజుకు మనుమసిద్ధికి పశువులను మేపుకొనే బీళ్లవిషయమై వివాదంకలిగి యుద్ధానికి దారితీసింది తిక్కన పెదతండ్రి కుమారుడు ఖడ్గతిక్కన సేనానాయకుడై ఈ యుద్ధంలో మరణించాడు. ఒకమాటు యుద్ధంలో ఓడిపోయివచ్చి ఇంటిలో పరాభవింపబడిన తరువాత రణమరణ మందినట్లు ప్రచారంలోవున్న కథను చారిత్రకులు విశ్వసించటంలేదు. తిక్కనలోకాని సమకాలపు

వాఙ్మయంలోకాని దీనికి ఆధారాలు కనబడవు. జానపద సాహిత్యంలో కాటమరాజుకథ ప్రసిద్ధమైనది.

## కాకతీయులు క్రీ. శ. 1000 - 1323

హనుమకొండ, ఓరుగల్లు రాజధానులు. వీరు పశ్చిమ చాళుక్యులకు సామంతులుగా వుండి క్రమంగా స్వతంత్రులైనారు. రుద్రదేవ మహాదేవుల తరువాత—

గణపతి 1198 - 1262

నేటి ఆంధ్రదేశం అంతా పరిపాలించిన చక్రవర్తి. తిక్కన గణపతిదేవుని సందర్శించి అతనికి తన భారత రచనను వినిపించాడు. గణపతిదేవుని కుమార్తె

రుద్రమదేవి 1262 - 1296

భర్త ఇందులూరి అన్నయదేవుడు




ప్రతాపరుద్రుడు 1296 - 1323

మారన, హుళక్కి భాస్కరాదులు, పాల్కురికి సోమన ఈకాలపు కవులు. ప్రతాపరుద్రుడు పరాక్రమవంతుడేకాని మహమ్మదీయుల ధాటి కాగలేక వారిచేత చిక్కి నర్మదాతీరంలో ఆత్మహత్య చేసుకొన్నాడు. కాకతీయ రాజధానీ నగరంలోని అపారమైన సంపదను మహమ్మదీయులు కొల్లగొట్టి ఢిల్లీ తీసుకొనిపోయారు.

కాకతీయసామ్రాజ్య పతనానంతరం రెడ్డి, వెలమ విజయనగర రాజ్యాలు వెలిశాయి.

## రెడ్డిరాజులు క్రీ. శ. 1325 - 1424

1. ప్రోలయ వేమారెడ్డి 1325 - 1353

ఎర్రాప్రగడ ఆస్థానకవి.

2. అనపోతారెడ్డి 1353 - 1364

3. అనవేమారెడ్డి 1364 - 1386

దానశీలుడని చాటు చాటువు లున్నాయి

4. కుమారగిరిరెడ్డి 1386 - 1402

విలాసప్రియుడు, వసంతోత్సవములకు ప్రసిద్ధి. కర్పూర వసంత రాయలని ఈతనికి బిరుదము. వసంతరాజీయ నాట్యశాస్త్ర గ్రంధకర్త.

5. పెదకోమటి వేమారెడ్డి 1402 - 1420

సంస్కృత పండితుడు. సర్వజ్ఞ బిరుదాంచితుడు. (సంస్కృత) సాహిత్య చింతామణి (అలంకారశాస్త్ర) గ్రంధకర్త.

శ్రీనాధుడు ఇతని ఆస్థానకవి, విద్యాధికారి.

6. రాచ వేమారెడ్డి 1420 - 1424

1424 లో రెడ్డిరాజ్యం విజయనగర రాజుల వశమైనది.

కుమారగిరిరెడ్డి తన అవసానకాలంలో కొండవీటి రాజ్యమును పెదకోమటి వేమారెడ్డికి, రాజమహేంద్రవర రాజ్యభాగమును తన బావమరదియైన కాటయ వేమునికి ఇచ్చెను.

రాజమహేంద్రవర శాఖ

1. కాటయ వేమారెడ్డి 1402 - 1414

కాళిదాసు నాటకత్రయమునకు సంస్కృతంలో వ్యాఖ్యానం రచించాడు.

2. అల్లాడరెడ్డి 1414 - 1423

3. వీరభద్రారెడ్డి 1423 - 1447

ఆస్థానకవులు - శ్రీనాథుడు, నిశ్శంకకొమ్మన.

1450 ప్రాంతంలో రాజమహేంద్రవరమును గజపతులు ఆక్రమించారు. అంతేకాదు, తీరాంధ్రమును పూర్తిగా — అటు శ్రీశైలంనుండి ఇటు ఉదయగిరివరకు గజపతులు లోబరచుకొనడంచేత శ్రీనాధునికి విలువ నీడలేకపోయింది. బొడ్డుపల్లి గుత్తకు పుచ్చుకొని శిస్తు చెల్లించలేక గజపతులచేత పరాభవం పొందినట్లు కనబడుతుంది.

చివరి సంగమరాజుల పాలనలో విజయనగరం బలహీనస్థితిలో పడింది. 1450 తరువాత సాళువ నరసనాయకుడు రాజై గజపతుల నోడించి విజయనగరమును కాపాడెను.

## రేచర్ల పద్మనాయకులు – రాచకొండ

1 మొదటి సింగమనాయకుడు

2. మొదటి అనపోత నాయకుడు 1361 – 1384

3. రెండవ సింగమనాయకుడు

గొప్ప విద్వాంసుడు, సర్వజ్ఞ బిరుదం, రసార్ణవ సుధాకరకర్త.

4. రెండవ అనపోతనాయకుడు 1399 – 1421

5. మాదానీడు 1421 – ?

6. మూడవ సింగమనాయకుడు 1425 – 1460

సర్వజ్ఞ బిరుదాంచితుడు, పోతన ఇతని పోషణలో వుండిన కవి. శ్రీనాధుడు ఇతని ఆస్థానమును దర్శించినాడు.

పద్మనాయకులకు రెడ్డిరాజులతో రాజకీయంగానే కాక వాఙ్మయ పోషణలో కూడా తీవ్ర స్పర్థ వుండేది. ఉదా. శ్రీనాధుడు ఆంధ్ర శృంగార నైషధ కావ్యము వ్రాయగా వెలమల ఆస్థానంలో మల్లినాధసూరి నైషధానికి సంస్కృతంలో వ్యాఖ్యానం రచించాడు.

## పద్మనాయకులు – దేవరకొండ శాఖ

1. మాధవనాయకుడు,

సోదరుడైన (రాచకొండ) అనపోత నాయకునిచేత దేవరకొండ పాలకుడుగా నియమితుడైనాడు.

2. పెద వేదగిరి

3. కుమార మాధవనాయడు

4. లింగమనాయడు

## విజయనగర రాజులు క్రీ. శ. 1336 – 1565 – 1680

### సంగమ వంశం

1. మొదటి హరిహరరాయలు 1336 – 1357

2 మొదటి (వీర) బుక్కరాయలు 1357 - 1377

నాచన సోమన ఆశ్రిత కవి. బుక్కరాయల కొడుకు కంపరాయలు. ఇతని భార్య గంగాదేవి సంస్కృత మధురావిజయ కావ్య రచయిత్రి

3. రెండవ హరిహరరాయలు 1377 - 1404

జక్కన కవి.

4. మొదటి దేవరాయలు 1404 - 1422

5 విజయ బుక్కరాయలు 1422 - 1423

6. రెండవ (ప్రౌఢ) దేవరాయలు 1423 - 1446

శ్రీనాథునికి కనకాభిషేకం చేసిన రాజు. ఇతని సామంతరాజులు సాంపరాయని కొడుకైన తెలుగురాయడు, పంటమైలారురెడ్డి — శ్రీనాధుని చాటువులలో స్మరింపబడినవారు.

7. మల్లికార్జునరాయలు 1447 - 1465

వినుకొండ వల్లభరాయడు.

8 విరూపాక్షరాయలు 1465 - 1486

## సాళువ వంశం

1. నరసింహరాయలు 1486 - 1491

కడపటి సంగమరాజును కడతేర్చి సాళువ నరసనాయకుడు రాజై రాజ్యాధికారమును వహించి నరసింహరాయలైనాడు. మహమ్మదీయాక్రాంతము కానున్న ఆంధ్ర సామ్రాజ్య రక్షణకై తా నిట్లు చేసెను. ఇతనికి ఇద్దరు కుమారులు. పెద్దకుమారుడు ఒక యుద్ధమున చనిపోగా రెండవ కుమారుడు రాజ్యమునకు వచ్చెను. పిల్లలమఱ్ఱి పినవీరభద్రుడు, తాళ్లపాక అన్నమాచార్యులు ఇతనికాలంవారు.

2. ఇమ్మడి నరసింహరాయలు 1491 - 1505

ఇతడు బలహీనుడైనందున తుళువ నరసనాయకుడు రక్షకుడై పాలించెను 1503 - 1505 - 3 ఏండ్లు రీజంటుగావుండి అటుపిమ్మట రాజును కడతేర్చి తాను రాజై రాజ్యాధికారమును చేపట్టెను.

## తుళువ వంశం

1. తుళువ నరసనాయకుడు 1503 - 1505

నంది మల్లయ ఘంట సింగయ జంటకవులు. ఇతని కొడుకులు వీరనరసింహరాయలు, కృష్ణదేవరాయలు, అచ్యుతదేవరాయలు.

2 వీరనరసింహరాయలు 1505 - 1509

తిమ్మరుసు మంత్రి. రాజుకు అకస్మాత్తుగా కలిగిన వ్యాధివలన చనిపోతూ తన ఎనిమిది ఏండ్ల కుమారుడు రాజుకావలెనను కాంక్షతో తమ్ముడు కృష్ణరాయల కళ్లు పీకించి తన కుమారునికి పట్టము కట్టమని తిమ్మరుసును ఆదేశించుట, తిమ్మరుసు మేక కన్నులు చూపి రాజును తృప్తిపరచి కృష్ణరాయలకు పట్టాభిషేకము చేయుట జరిగినది. కృష్ణరాయలు తన అన్నకుమారునికి అపాయము కలిగించక సవతి తమ్ములైన అచ్యుతదేవరాయ, శ్రీరంగరాయలతోపాటు చంద్రగిరిలో అన్ని సౌఖ్యములతోను విడిబైదులో ఉంచినాడు. అన్నకుమారుడు (పేరు తెలియదు) బైదులోనే 20 ఏండ్లు జీవించి మరణించెను.

3. కృష్ణరాయలు 1509 - 1529

అష్టదిగ్గజములలో మాదయ్యగారి మల్లన పెద్దనకంటె పెద్దవాడు. మల్లన రాజశేఖర చరిత్రము రాయల కంకితము కాదు. రాయల కంకిత మిచ్చినవా రిద్దరే, పెద్దన తిమ్మనలు. వీ రిద్దరు కృష్ణరాయల బాల్యమిత్రులు కావచ్చును. పెద్దన రాయల తర్వాత జీవించి యున్నాడు తిమ్మన విషయం తెలియదు. పెద్దన వైష్ణవ శఠకోపయతి శిష్యుడు తిమ్మన శైవుడు, అఘోర శివగురు శిష్యుడు. రాయలు వీ రిద్దరిని సమానంగా ఆదరించినాడు. ధూర్జటి రాయల సభలో ఉన్నమాట వాస్తవం. కాని రాయల కంకిత మివ్వలేదు. రామరాజ భూషణుడు తిమ్మనకో పెద్దనకో శిష్యుడు. కందుకూరి రుద్రకవి రాయల ఆస్థానకవి అవునా కాదా అన్నది నిశ్చయంగా తెలియదు. ఉయ్యాలరాజు రామభద్రుడు, రాధామాధవకవి రాయలసభలో వుండే వారు తెనాలి రామలింగడు, పింగళి సూరన, రామరాజభూషణుడు నాటికి యువకవులు.

రాయలు తనకు సంతానము లేనందవలన తన తరువాత రాజ్యమును రాణులు కోరుతున్నప్పటికి అళియరామరాయలకు ఇయ్యక తమ్ముడైన అచ్యుతరాయలకు ఇప్పించెను ఆదినుండి రాయలు న్యాయమూర్తి; దేశక్షేమమును పరమ లక్ష్యముగా పెట్టుకొని ప్రవర్తించినాడు. తిమ్మరుసు కళ్లు తీయించిన కథలో సత్యము కానిరాదు. రాయల తరువాత తిమ్మరుసు బ్రతికివున్నాడు. తిరుపతి దేవస్థానం శాసనాల్లో తిమ్మరుసు దేవస్థానంలో తనకుగల హక్కులను కొన్ని అమ్ముకొన్నట్లు తెలుస్తూంది అంటే తిమ్మరుసు అంతటివాడు, రాయరాజ్యస్థాపనాచార్యుడు, శ్రీనాథునికివలె దిన వెచ్చమునకు కష్టపడ్డాడన్నమాట.

రాయలు జీవించియుండగా అళియరామరాయలు ఎందువలననో ఒక్క యుద్ధంలో కూడా పాల్గొనలేదు. అచ్యుతదేవరాయల పట్టాభిషేకమునకు భంగం కలిగించడానికి తీవ్రప్రయత్నంచేసి విఫలుడై సమాధానానికి వచ్చాడు. అచ్యుత దేవరాయలు 12 ఏండ్లు పరిపాలించెను. అతనివెనుక వెంకటపతిరాయలు కొద్దికాలము, అటువెనుక సదాశివరాయలు రాజులైరి. సదాశివరాయల కాలంనుంచి అళియ రామరాయలు సర్వాధికారి అయినాడు. రక్షసతంగడి యుద్ధానంతరం కూడా సదాశివ రాయలు బ్రతికివున్నాడు. పెనుగొండ, చంద్రగిరి అప్పటినుండి విజయనగర రాజులకు రాజధానులు. తరువాత కొంతకాలానికి పెనుగొండపోయి చంద్రగిరిమాత్రం మిగిలింది. బ్రిటిషువారు చంద్రగిరిరాజునుండి చెన్నపట్టణంమీద 1639 లో అధికారం పొందారు.

4 అచ్యుతదేవరాయలు 1530 – 1542

ఆంధ్రభాషాభిమాని. ప్రతిసంవత్సరం వేంకటేశ్వరునికి కావ్య పుష్పం సమర్పించేవాడు. అయినా అష్టదిగ్గజకవులలో మిగిలినవా రెవరూ ఇతనిదగ్గిర చేరలేదు.

5. సదాశివరాయలు 1542 – 1565

రామరాయలు సర్వాధికారి. 1567 రక్కసతంగడి యుద్ధంలో మహమ్మదీయులు విజయనగరమును ఓడించి కొల్లగొట్టారు. అప్పటినుండి విజయనగరరాజ్య ప్రాభవం క్షీణించింది. రణమరణ మొందునప్పటికి అళియరామరాయలకు 96 ఏళ్ల వయస్సు.

## ఆరవీటి వంశం

1. తిరుమల దేవరాయలు 1565 - 1572

   ఇతడు రామరాయల తమ్ముడు. పెనుగొండనుంచి పాలించాడు సదాశివరాయలు నామమాత్రపు రాజు

2. మొదటి శ్రీరంగదేవరాయలు 1572 - 1585

   తిరుమలరాయల సంతతివారు ఇప్పటినుండి పాలకులు. పెనుగొండ రాజధాని.

3. వెంకటపతి దేవరాయలు 1585 - 1614

   చంద్రగిరి రాజధాని. కృష్ణరాయలతో దీటైనవాడు. విజయనగర రాజ్యపాలకులలో చివరి గొప్పరాజు. తరువాతి రాజులు బలహీనులు. 1622 లో మైసూరు రాజ్యం ఏర్పడింది. దీనికి శ్రీరంగపట్నం రాజధాని బీజపూరు గోలకొండ రాజులు క్రమంగా బలవంతు లయారు దక్షిణంలో 1614 తరువాత మధుర, తంజావూరు, పుదుక్కోట రాజుల ప్రాభవం ఎక్కువ అయింది

   తెనాలి రామలింగడు, అప్పయ దీక్షితుడు, మట్ల అనంతుడు, తరిగొప్పుల మల్లన ఇతనికాలంలోవున్న కవులు.

4. రెండవ శ్రీరంగరాయలు (చిక్కరాయలు) 1614 - 1618

5. రామదేవరాయలు 1618 - 1630

6. పెదవేంకటపతిరాయలు 1630 - 1642

   సర్ ఫ్రాన్సిస్ డే ఇతనినుండి మదరాసు తీరంలో వ్యాపారస్థలంగా కోట కట్టుకోడానికి ఉత్తరువు పొందాడు ఈ కోటకే Fort St. George అని పేరు.

7. మూడవ శ్రీరంగరాయలు 1642 - 1678

8. వేంకటపతిరాయలు 1678 - 1680

## గోలకొండ నవాబులు క్రీ. శ. 1512 - 1687

మతసహనంతో వ్యవహరించటమే కాక వీరు ఆంధ్రరాజులవలెనే ఆంధ్ర వాఙ్మయం పోషించారు. తానాషా కాలంలో భద్రాద్రిలో రామాలయం కట్టబడింది.

1. కులీ కుతుబ్‌షా 1512 - 1543
2. జంషీద్ కుతుబ్‌షా 1543 - 1550
3. ఇబ్రహీం కుతుబ్‌షా 1550 - 1580
   ఈ నవాబును మనవారు మల్కిభరాం అని, ఇభరాముడని వ్యవహరించారు అద్దంకి గంగాధరకవి, పొన్నగంటి తెలగన, కందుకూరి రుద్రకవి ఇతని కాలపు కవులు.
4. మహమ్మద్ కులీ కుతుబ్‌షా 1580 - 1611
   సారంగు తమ్మయ్య.
5. అబ్దుల్లాహుసేన్ కుతుబ్‌షా 1611 - 1659
6. అబుల్‌హసన్ కుతుబ్‌షా (తానాషా) 1659 - 1687
   అక్కన్న మాదన్నలు మంత్రులు, కంచర్ల గోపన్న (= రామదాసు), అక్బర్‌షా (శృంగారమంజరీ రచయిత) ఇతనికాలపువారు.

ఔరంగజేబు 1687 లో గోలకొండను జయించి తన రాజ్యంలో కలుపుకున్నాడు. గోలకొండ నవాబులు మహమ్మదీయులే అయినా, షియా సున్నీ భేదములు ఔరంగజేబు దాడికి కారణమయినవి.

### నిజాం వంశం

గోలకొండనవాబుల తరువాత 17, 18 శతాబ్దాల్లో అసఫ్‌జావంశం హైదరాబాదు పాలకులయారు. వీరికి 'నైజాం' అన్నది బిరుదనామం

బ్రిటిషువారు ఫ్రెంచివారు దేశీయుల వ్యవహారాల్లో జోక్యం కల్పించుకొని బలవంతు లవుతూవచ్చారు. బ్రిటిష్ - ఫ్రెంచి వారిమధ్య పోరాటంలో బ్రిటిష్‌వారిది పైచేయి అయింది. వీరు బలహీనుడైన నైజాముకు చేసిన సైన్య సహాయానికి ప్రతిఫలంగా అతనినుండి సర్కారుజిల్లాలు, రాయలసీమలో దత్తమండలాలు తీసుకున్నారు.

## నాయక రాజులు

విజయనగర సామ్రాజ్యంలో అమరనాయకులుగా వుండిన దక్షిణదేశపు సామంతులు రక్షస తంగడి యుద్ధానంతరం రాజచిహ్నాములు ధరించి స్వతంత్రులైనారు.

### తంజావూరి నాయకరాజులు

చెవ్వప్పనాయకుడు 1535 - 1561

అచ్యుతప్పనాయకుడు 1561 - 1614

రఘునాథనాయకుడు 1614 - 1633
చేమకూర వేంకటకవి, కృష్ణాధ్వరి కవులు.

విజయరాఘవనాయకుడు 1633 - 1673
చెంగల్వ కాళకవి, కోనేటి దీక్షితుడు, పురుషోత్తమ దీక్షితుడు, రంగాజమ్మ కవులు.

1673 లో మధురనాయకుల సేనాని దండెత్తిరాగా విజయరాఘవుడు, అతని కొడుకు మన్నారుదేవుడు రణరంగమున నిహతులైనారు. అచిరకాలంలోనే తంజావూరు మహారాష్ట్ర రాజుల ఏలుబడిలోనికి వచ్చింది. సుప్రసిద్ధుడైన శివాజి తమ్ముడు ఏకోజి 1675 తంజావూరు పాలకు డయినాడు.

### మహారాష్ట్ర రాజులు

వీరు తమ మాతృభాషయైన మహారాష్ట్రిని రాజభాషగా చేయక తత్పూర్వం ప్రచారంలోవున్న తెలుగునే ఆదరించారు ఆనాడు తంజావూరు రాజ్యంలో దేశభాష తమిళము, పాలకుల భాష మహారాష్ట్రి, కవిపండితుల భాష తెనుగు. కనుకనే నాటి యక్షగాన రచనలలో పాత్రలు ఈ మూడు భాషలను వ్యవహరించడం చూడగలము.

ఏకోజీ 1675 - 1684

శివాజీ 1684 - 1712
కవిపండితుడు, యక్షగానకర్త. ఆస్థానకవు లనేకులు యక్షగాన కర్తలు. వీరిలో గిరిరాజకవి యొకడు ఇతని పౌత్రుడు త్యాగరాజు.

శరభోజి 1712 - 1728

ఈ రాజుల ఆంధ్రభాషాభిమానమునకు శరభోజి సరస్వతీమహల్ పుస్తకభాండాగారము ప్రత్యక్ష చిహ్నము.

తులజాజి 1728 - 1736

యక్షగానకర్త.

జయసింహుడు 1736 - 1737

రెండవ ఏకోజి 1737 - 1739

ప్రతాపసింహుడు 1740 - 1762

ముద్దుపళని ఆస్థానకవయిత్రి.

రెండవ తులజాజి 1762 - 1787

అమరసింహుడు 1787 - 1798

మాతృభూతకవి - యక్షగానకర్త.

రెండవ శరభోజి 1798 - 1833

రెండవ శివాజి 1833 - 1855

కవి, యక్షగానకర్త.

## మధుర నాయక రాజులు

విశ్వనాథనాయకుడు 1529 - 1564

మొదటి కృష్ణప్పనాయకుడు 1564 - 1572

వీరప్పనాయకుడు 1572 - 1595

రెండవ కృష్ణప్పనాయకుడు 1595 - 1601

ముద్దు కృష్ణప్పనాయకుడు 1601 - 1909

మొదటి ముద్దు వీరప్పనాయకుడు 1609 - 1623

తిరుమలనాయకుడు 1623 - 1659

లింగనమఖి కామేశ్వరకవి, క్షేత్రయ్య.

చొక్కనాథనాయకుడు 1659 - 1682

మూడవ ముద్దు వీరప్పనాయకుడు 1682 - 1689

గణపవరపు వేంకటకవి.

రాణి మంగమ్మ 1689 - 1706

(విజయరంగ చొక్కనాథుని తరపున పితామహి)

విజయరంగ చొక్కనాథుడు 1706 - 1732

స్వయంగా కవి, సముఖం వెంకటకృష్ణప్ప, శేషం వెంకటపతి, వెలగపూడి కృష్ణయ్య, కుందుర్తి వెంకటాచలపతి ఆస్థానకవులు.

మీనాక్షి 1732 - 1739.

## సింహావలోకనం

శాతవాహన, ఇక్ష్వాకు, పల్లవ, బృహత్ఫలాయన, శాలంకాయన రాజుల కాలంలో రాజభాష ప్రాకృతం, విష్ణుకుండినుల రాజభాష సంస్కృతం.

దేశికవితను నెలకొల్పినవారు తూర్పు చాళుక్యులు. రాజరాజు ప్రోత్సాహమున నన్నయ ఆంధ్రమహాభారతమును రచించాడు.

కాకతీయుల కాలంలో ఆంధ్రజాతీయతాభావం స్పష్టరూపమున ఏర్పడింది. రెడ్డి, వెలమ, విజయనగరరాజులు ఈ భావాన్ని ప్రోదిచేశారు. దక్షిణదేశంలో హిందూ ధర్మపరిరక్షణ గావించి ఆంధ్రకవితకు కనకాభిషేకం చేసినది విజయనగరం. సాహితీ సమరాంగణ సార్వభౌముడు ధర్మమూర్తి అయిన కృష్ణరాయలవంటి రాజు ప్రపంచ చరిత్రలోనే మరొకడు కానరాడు. మన దేశచరిత్రలో భోజుడు ఒక్కడు వున్నాడు.

గోలకొండనవాబులు మతసహనము కలవారై ఆంధ్రవాఙ్మయమును పోషించారు. తంజావూరు, మదుర [illegible] రాజులు సాహిత్య, కళాపోషణలో విజయనగర సంప్రదాయమును పాటించారు.